*Issued on 15—10—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*TUESDAY, 4th OCTOBER, 1955.*

VOLUME X — No. 3.

CONTENTS




PRINTED BY DALTON & COMPANY, KURNOOL,
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.
1956

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Tuesday, 4th October*, 1955

The House met in the Assembly Hall Kurnool, at eleven of the clock, Mr. Speaker, (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS.

### Short Notice Starred Question.

*Chemical manures allotted to Andhra State.*

504-A,

* 2087 - C. Q.—SRI B. SANKARAIAH : Will the Hon. the Chief Minister be pleased to state :

(*a*) The quota of chemical manures allotted to the Andhra State this year;

(*b*) The quantity so far imported into the State out of that quota; and

(*c*) The action taken for getting the balance of the quota ?

The HON. SRI B. GOPALA REDDI :—

(*a*) 76,885 Tons.

(*b*) 40,746 Tons (Upto 30—9—55)

(*c*) The Government of India have been taking all possible steps for the supply of the balance. Arrangements have also been made for import of fertilisers from abroad and two ships carrying 19,500 tons of Ammonium Sulphate intended for this State would have arrived and discharged the fertilisers by this time at Visakhapatnam and Madras Ports.

Sri B. SANKARAIAH :—మన ఆంధ్రరాష్ట్రము ఎక్కువగా రసాయనిక ఎరువులు వాడుకొనే ప్రాంతము. గతసంవత్సరం కోటా సింద్రి ఫ్యాక్టరీ నుంచి సప్లయి చేసినారు. ఇప్పుడు విదేశమునుండి ఇవ్వడము, అది పూర్తిగా రాకపోవ

డము అందువల్ల black market జరుగుతోంది. ఈ ఎరువులు విదేశ ఫ్యాక్టరీనుంచి తెప్పించవలసిన కారణం ఏమిటి ? ఇకనైనా వెంటనే సింద్రినుంచి తెప్పించడానికి చర్య తీసుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—సింద్రినుంచిగానీ, విదేశము నుంచిగాని మనకు వాళ్లు ప్రామిస్‌చేసిన 76,885 టన్నులు మేము తెప్పించడానికి అన్నివిధాలా ప్రయత్నము చేస్తున్నాము. అది ఓడల ద్వారాకూడా వస్తున్నది.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, గతసంవత్సరము ఇదే సీజనులో 90 వేల టన్నులువరకు మన ఆంధ్రరాష్ట్రములో వాడినారు అని చెబుతున్నారు. అటువంటి పరిస్థితిలో ఈ సంవత్సరము 76,885 టన్నులు మాత్రమే మనకు కోటా allot చేయడానికి కారణము ఏమిటి ? ఈనాడు ఆంధ్రరాష్ట్రంలో వ్యవసాయానికి సంబంధించినంతవరకు పంటలువేసే సీజను అయిపోయింది. ఇవి ఇంకా నెల్లూరు జిల్లాలోను ఏకొద్ది ప్రాంతములలోనో ఉపయోగించవలసిన అవసరమువున్నది. కాని సీజనుఅంతా అయిపోయ్యేవరకు కోటా రాకపోవడానికి కారణము ఏమిటి ? వాటిని విశదీకరించాలని కోరుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—పోయిన సంవత్సరము 90 వేల చిల్లర ఈ సంవత్సరము 76,885 టన్నుల కోటాను, ఇతర రాష్ట్రములలో వత్తిడి వుండడమువల్ల మనకోటా తగ్గించారేమో నని అనుకొంటాను. ఈ సంవత్సరము మనకు రావలసిన కోటా ఇంకా రాకపోవడానికి వాగనులు కొరత గా ఉన్నవి. అందువల్ల అక్కడనుంచి సరీగా దిగుమతి కావడములేదు. బహుశ ప్రొడక్షనుకూడా ఏమైనా affect అయిందేమో.

Sri L. LAKSHMANA DAS :—ఆంధ్రదేశంలో రసాయనిక ఎరువులు చాలా వాడబడుతున్నాయి. చాలామంది ఉపయోగిస్తున్నారు. సీజను అయిపోకముందే మార్చి, ఏప్రియలు నెలల్లోగా ఈ కోటాలు అన్నీ వచ్చేటట్లుగా వచ్చే సంవత్సరమునుంచి అయినా ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—తప్పకుండా ప్రయత్నము చేస్తాము. ఈదినమే అవసరమైతే టెలిగ్రాముకూడా పంపడానికి ప్రయత్నం చేస్తాం.

SRI S. VEMAYYA :—ఇంకా బాలన్సు 36 వేలు ఉందన్నారు. అది ఎప్పటిలోపల రావాలని మంత్రిగారు టెలిగ్రాము ఇస్తారు ? తొందరగా వచ్చేదానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంకా 36 వేలు బాకీ వున్నది. దాంట్లో 19,500 పడవల ద్వారా విశాఖపట్టణము, మద్రాసు రేవులకు వస్తున్నవి. ఇక పోతే 18 వేలు వుంటుంది. అదికూడా సాధ్యమైనంత శీఘ్రంలో రావడానికి ప్రయత్నము చేస్తాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :—కేంద్ర ప్రభుత్వాన్ని మనకు పంపవలసిన కోటా ఎందుకు పంపలేక పోయారో వ్రాసి కనుక్కొంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—రైల్వే కారణాలవల్ల రాలేకపోయిందని అనుకొంటాను. అందువల్ల ఇప్పుడు పడవలలో తీసుకువస్తున్నారు. రైల్వేవారు ఎంత ప్రయత్నము చేసినప్పటికినీ ఆ condition రాకుండా పోతున్నది. ఇటీవల మేము ఢిల్లీ వెళ్లినప్పుడుకూడా రైల్వేవాళ్ళతో మాట్లాడినాము. వాళ్లు ఏదో చేస్తున్నారు గాని అది వాళ్ళకే తృప్తికరంగాలేదు. మేము ఎంత ప్రయత్నముచేసినా ఇంకా ఎక్కువ condition లు వుంటున్నవని వారు చెబుతున్నారు. అందుచేత ఖాజీపేటనుంచి జిల్లాచివరవరకు రైల్వేలైను వేయాలని ప్రపోజలు వున్నది. అదిజరిగితే ఈకొరత మనకు తీరుతుంది.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా! ఇప్పుడు ధాన్యంపంటలకు చాలావరకు ధరలు తగ్గిపోయినాయి. అందువల్ల ఈ ఎరువులకుకూడా కోటా తగ్గించడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇటీవలనే వాటికికూడా కొంచెము ధర తగ్గించాము. అంతకన్నా తగ్గించితే గిట్టుబాటు కాదు. ఎన్నో కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టి ఆ సింద్రీ ఫ్యాక్టరీని నెలకొల్పినారు.

SRI B. SANKARAIAH :—గవర్నమెంటు నిర్ణయించినధర 38 రూపాయలువుంటే, 40, 50 రూపాయలుకూడా మార్కెటులో ఎరువులను అమ్ముతున్నారు. అందుచేత దీనిని వ్యవసాయ సంఘాల ద్వారా, సహకార సంఘాల ద్వారా ఇస్తే గవర్నమెంటు నిర్ణయించిన ధరకైనా రైతులకు దొరుకుతుందేమో ప్రభుత్వమువారు ఆలోచిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ విషయము జనవరినుంచి అమల్లోకి వస్తుంది. ఇప్పుడు వున్నటువంటి arrangements డిసెంబరు ఆఖరువరకు వుంటాయి. తరువాత ఏమిచేయాలనే విషయం త్వరలోనే నిర్ణయిస్తాము.

SRI P. VENKATASUBBAYYA :—మనకు allot చేసినటువంటి రసాయనిక ఎరువులు ఏఏ రకాలు ? ఒక్కొక్క రకమైన ఎరువు వుత్పత్తి దరఎంత ? మనకు allot చేసినప్పుడు ఏ ధరలో ఇస్తున్నారు.

THE HON. SRI B. GOPALA REDDI :—ఇది చాలా పెద్ద ప్రశ్న. వేరే ప్రశ్న వేస్తే సమాధానం చెబుతాను.

SRI P. SREERAMULU :—రసాయినిక ఎరువుల డిమాండు చాలా ఎక్కువగా ఉన్నదని ప్రభుత్వానికి తెలుసు. అందువల్ల ఆంధ్ర దేశంలో విజయవాడలో ఒక ఫ్యాక్టరీ నిర్మించడానికి ఆలోచనలోవున్నట్లుకూడా తెలిసినది. అది House లో కూడా చెప్పివున్నారు. దాని నిర్మాణము ఎప్పుడు ఆరంభమవుతుంది ?

THE HON. SRI B. GOPALA REDDI:—అలా లేదు. యిలా లేదు.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, మనకు రావలసినటువంటి కోటా జూన్, జూలైలో విశాఖపట్టణం రేవుకు ఓడవచ్చినట్లు, దానిని ఆ రేవులో దింపడానికి చోటులేనని మద్రాసు రేవుకు పంపడము జరిగిందని సెలవిచ్చినారు. మద్రాసులో దిగుమతి చేసినటువంటి కోటా మన ఆంధ్ర రాష్ట్రము రాకుండా ఇతర రాష్ట్రాలకు వెళ్లిపోయిందా ? దానికి గవర్నమెంటు ఏమి చర్యలు తీసుకుంటున్నారు ?

THE HON. SRI B. GOPALA REDDI :—మద్రాసునుంచీ అవీ ఎక్కడికీ పోతాయనే వుద్దేశ్యంతో వారు మద్రాసుకుదగ్గరవున్న జిల్లాలకు సప్లయి చేయవలసిన దానిని మద్రాసుకని, విశాఖపట్టణందగ్గర వాటికి విశాఖపట్టణముకని, నిర్ణయించబడింది. మద్రాసునుంచి బెజవాడ రావడానికి కండీషనువున్నదిగాని, బెజవాడనుంచి మద్రాసు పోవడానికి కండీషను లేదు. అందువల్ల మద్రాసునుంచి పంపిస్తున్నారు, అని నేను ఆశిస్తున్నాను.

## Short Notice Starred Question.

### *Village Officers in Estates taken over by the Government.*

**504-B :—**

***2095-C. Q.—SRI R. B. RAMAKRISHNA RAJU : Will the Hon. the Minister for Revenue be pleased to state :**

4th October 1955]

(*a*) whether the Government have decided to pay the village officers in Estates taken over by the Government salaries on a par with those in Ryotwari areas ; and

(*b*) if so, at what rates and from which date ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Clause (a) The question of refixing the salaries of village officers in estates taken over by the Government at the rates applicable to those in ryotwari areas is under the consideration of the Government.

Clause (b) Does not arise.

SRI S. RANGANATHA MUDALIAR : Will the Government state how long it will take for the Government to revise the rates ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ ఎస్టేట్లు ఇంకా కొన్నిచోట్ల సెటిల్‌మెంట్సు కాకపోవడం ఇప్పుడు ఏమీచేయడానికి వీలులేదు. అది ఇప్పుడు intensive period గా వున్నది. అయిపోయిన వాటి కన్నింటికికూడా Villages అన్నీ regroup చేసి రైత్వారీ ఏరియాలో ఎట్లా salaries ఇస్తున్నారో అట్లు ఇస్తాము.

SRI S. RANGANATHA MUDALIAR :—Will the Government appreciate that the village officers in the estate villages are doing as much work as in ryotwari villages and that it is urgent that the rates should be brought into force as early as possible.

THE HON. SRI K. CHANDRAMOULI .—వారు కొన్నికష్టాలలో వున్నారని నాకుకూడా తెలుసు. అయితే కొన్ని limitations వున్న విషయం మొదలియార్ గారుకూడా తెలుసుకోవాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు రైత్వారీరేట్లు అమలు జరిపినట్లయితే ప్రభుత్వానికి అదనంగా ఎంతడబ్బు ఖర్చు అవుతుంది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొన్నిచోట్ల అట్లా జరపడానికి వీలులేదు. ఇంకా అప్పుడే లెఖ్ఖ ప్రశ్న ఎట్లావస్తుంది ? ఇది జరిపి నప్పుడుగదా !

SRI PILLALAMARRI VENKATESWARLU :—జరుపదలచు కున్న ప్రాంతాలలో ఎంత అవుతుందో చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది ఇప్పుడు ఏమీ చెప్పలేను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఎస్టేట్లను తీసికొన్న చోట్ల వెట్టి, village పోలీసులను appoint చేయలేదు. ఇదివరకు ఉన్నవాళ్లను తొలగించారు. వాళ్లను తిరిగి appoint చేసే విషయం ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Village servants అంటే కరణం, మునసబు మాత్రమేకాకుండా వెట్టి, మోతాదు అందరూ వస్తారు. వారి విషయంకూడా ఆలోచనలో ఉన్నది.

SRI P. SUNDARAYYA :—Settlement పూర్తికానిదే రైత్వారీ ప్రాంతాలలో village officers కు ఇచ్చే జీతాలు Estate వాళ్లకు ఇవ్వడానికి సాధ్యంకాదన్నారు. ఎందువల్ల ? రైత్వారీప్రాంతాలలో జీతాలు మీకు తెలుసును. ఎస్టేటు ప్రాంతాలలోఉన్న జీతాలు మీకు తెలుసును. ఆ జీతాలువారికి ఇవ్వడానికి ఎటువంటి legal అభ్యంతరాలున్నాయి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇపుడున్న పరిస్థితులను బట్టి రెవెన్యూబోర్డు ఆలోచనలోఉన్న విషయాన్ని బట్టిచూస్తే ఎస్టేట్లలో చిన్న చిన్న villages కు కూడా ఎక్కువమంది ఆఫీసర్లున్నారు. కొంతమందిని adjust చేయవలసియున్నది. వీళ్ళను తగ్గించాలో తీసివేయాలో ఇంకా తేలలేదు. కొన్ని చోట్ల ఏమీ జీతాలులేనివాళ్లుకూడా ఉన్నారు. ఇటువంటి వాళ్లకు ఏదో కొంత interim గా చేస్తాము.

SRI P. SUNDARAYYA :—బడ్జెటులో మీరు ఇచ్చిన లెక్కలను బట్టి చూస్తే ఆంధ్రరాష్ట్రంలో మూడవవంతు జమీందారి ప్రాంతంగాఉన్నది. మొత్తం గ్రామోద్యోగులలో 1/3 వంతు మాత్రమే ఎస్టేటు గ్రామాలలో ఉన్నారుకాని అంతకన్న ఎక్కువలేరు. ఎందువల్ల ఇబ్బంది కలిగిందో సెలవిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Correct గా ఆ విధంగా ఉండదు. ఆ ప్రకారమే ఆఫీసర్లు ఉన్నారను కోడానికి వీలులేదు.

SRI D. KONDAIAH CHOWDARY :—సర్వే పూర్తి కానిచే రైత్వారీ ప్రాంతాలలో మాదిరిగా ఇవ్వడానికి వీలులేదని అంటున్నారు. ఏడు సంవత్సరాలైనది. కొన్నిచోట్ల survey పూర్తిఅయినది. అక్కడైనా రైత్వారీ ప్రాంతాలలోని village officers తో సమానంగా ఇవ్వడానికి చూస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—పూర్తిఅయినచోట్ల ఇస్తూనే ఉన్నాము. పూర్తి కానిచోట్ల ఈ వ్యవహారము ఆలోచనలో ఉన్నది.

SRI K. VENKATASWAMI REDDI :—Taken over estates లో nearly 40% of Village Officers జీతాలులేకుండా పనిచేస్తున్నారని మంత్రిగారే చెప్పారు. జీతాలు సమస్థాయిలోనికి తీసుకురావడం consideration లో ఉందని చెప్పారు. ఈమధ్య కాలంలో జీతాలు లేనివారికి ప్రస్తుత estate areas లో ఇచ్చే జీతాలైనా ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రయత్నం చేస్తాము. వెనుక సంవత్సరాలకుకూడా ఇవ్వడానికి ఆలోచన చేస్తాము.

SRI M. NAGI REDDI :—ఎస్టేట్లలో పని చేసే village officers కు ఏవిధంగా జీతాలు ఇస్తున్నారు ? ఆలస్యమైనప్పటికీ రైత్వారీ ప్రాంతాలతో సమంగా ఇచ్చేటప్పుడు estates taken over date నుంచి retrospective effect ఇవ్వడానికి చూస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది సాధ్యంకాదు. ఇప్పుడు rates ప్రకారం రైత్వారీ areas లో village headman కు రు. 17 లు ఇస్తే proprietory areas లో రు. లు 11 ఉన్నది. కరణానికి రు. 18 లు రు. 11 లు ; Servants కు రు. 11 లు-రు. 9 లు ఉన్నది. Retrospective effect తో ఇవ్వడానికి వీలులేదు.

SRI P. SUNDARAYYA :—Settlement పూర్తి అయ్యేవరకు ఇవ్వడానికి వీలులేదు అన్నారు. ఇదివరకు ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ settlement పూర్తికాలేదన్నారు. ఈ ఎనిమిది సంవత్సరాలే కాక మరొక అయిదు సంవత్సరాలవరకు జీతాలు లేకనో, తక్కువ జీతాలతోనో కాలం గడపడం ఏమి న్యాయం ? న్యాయంకానప్పుడు ad hoc గా నైనా ఆలోచించి ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—జీతాలు లేనివారికి ఏదో కొంత ఇస్తున్నాం అని చెప్పాను. తక్కువ జీతాల వారి విషయం ఆలోచిస్తున్నాం.

SRI M. NAGI REDDI :—Village officers జీతాలు పెంచడానికి వీలులేదని చెప్పారు. కరువు భత్యమైనా ఇస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI :—వాళ్లకుకూడా భత్యాలు ఉన్నాయి. Proprietory areas లో. Village Headmen కు D. A రు. 3 లు ; Karnam కు రు. 5 లు ; Servants కు రు. 7 లు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—వెట్టి వగైరాలను తొలగించారు. Resurvey అయ్యేవరకు చేయడానికి వీలులేదని తొలగించారు. దానికి చాలా కాలం పడుతుంది. Abeyance లో ఉంచి accounts తేలేవరకు ఉండాలని అన్నారు. వాళ్లను తిరిగి తీసుకునే విషయం ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Settlement అయితే తప్ప ఏమీ చేయడానికి వీలులేదు.

SRI RAJA V. V. KRISHNA RAJA BAHADUR:—Government area లలో ఉండే రైత్వారీ ప్రాంతాలలోని ఈనాము area లలోను జీతాలు తగ్గిస్తాము అని చెప్పారు. ఒక నాడు జమీందారీ abolition bill వచ్చింది. ఈనాడు taxation ఈనాములు మీద వేస్తున్నాము. రేపు కండ్రికలు వగైరాల మీద బిల్లు తెస్తున్నాము. మొత్తం అందరికి సమాన జీతాలు పెట్టడం అవసరమనే విషయం మంత్రిగారు గుర్తిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అదే ఆలోచనలో ఉన్నది. తగ్గించడానికి చూడడంలేదు.

SRI S. VEMAYYA :—ఈ settlement ప్రతిబంధకం కొంత ఉంది జమీందారులు writ వేయడంవల్ల జరిగిందని తెలుస్తోంది. వాటిని dispose చేయడానికి ప్రభుత్వం చర్య తీసుకుంటుందా ?

MR. SPEAKER :—How can they do ?

Starred Questions.

*"Malayappan Report" regarding the uplift of the Scheduled Tribes.*

561.

*20. Q.—SRI S. VEMAYYA : Will the Hon'ble the Minister for Electricity and Social Welfare be pleased to State :

(*a*) Whether there is a proposal to implement the recommendations of 'Malayappan Report' regarding the uplift of Scheduled Tribes in the State now; &

(*b*) the recommendations so far implemented ?

THE HON. SRI G. LATCHANNA :—

(*a*) Yes, Sir.

(*b*) The information is placed on the Table of the House.

(a) అవునండి.

(b) జవాబు మీముందు ఉంచబడింది.

SRI S. VEMAYYA :—ఈ ప్రశ్న సందర్భంలో ఒక point of order అడుగదలచుకున్నాను. ఈ ప్రశ్న 6½ మాసాల క్రితం పంపబడింది. 6½ మాసాలుగా ఈ జవాబు ఎక్కడ ఆలస్యమైనది ? మన ఆఫీసులోనా, సెక్రటేరియట్ లోనా? ఎందువల్ల ఆలస్యమయినది ? ఇంతకాలం ఆలస్యమవడం ఏమి బాగాలేదు. 1, 2 మాసాల్లో జవాబు రావడానికి direction ఇస్తారని ఆశిస్తున్నాను.

Implement చేయకుండా ఉన్నా వివరాలు ఏవో తెలివిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—చేసినది చెప్పాను. చేయనివి కావాలంటే మరొక ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI MAHAMMAD TAHSIL :—గన్నవరం కాలనీలో ఉండే భూములను 20 సంవత్సరాలనుండి చేస్తున్న రైతాంగాన్ని తొలగించి colony membersగా చేరినవారికి ఇస్తున్నారు. అది చాలా అన్యాయం కాబట్టి ఆవిధంగా చేయకుండా orders జారీ చేస్తారా ?

---

*Vide Appendix at page infra.

[4th October 1955

MR. SPEAKER:—Malayappan Report లో ఆవిషయం ఉన్నదా?

SRI MAHAMMED TAHSIL :—గన్నవరం కాలనీ మలయప్పన్ రిపోర్టులోనిదే.

THE HON. SRI G. LATCHANNA :—ఇది మలయప్పన్ కమిటీ రిపోర్టుకు సంబంధించిన ప్రశ్న. కొన్నిభూములు ఎవరో ఆక్రమించుకుంటున్నారంటే అది వేరేప్రశ్న.

SRI MAHAMMED TAHSIL :—మలయప్పన్ రిపోర్టులో land colonization schemes ఉన్నాయి. దానిక్రింద నే గన్నవరంకాలనీ కట్టారు. ఆ కాలనీక్రింద భూములువిషయం నేనుచెబుతున్నాను.

THE HON: SRI G. LATCHANNA :—కాలనీలవిషయం రిపోర్టులో ఉన్నది, కొన్ని పెట్టారు. కాని ఏభూమి ఎవరు ఆక్రమించుకున్నారు అనేదానికి ఈ ప్రశ్నలో సమాధానం రావాలంటే కష్టం.

SRI P. SUNDARAYYA :—ఆ కాలనీ ఏర్పాటుచేసిన తరువాత అక్కడవుండే ఆదిమవాసులకు భూములు దక్కకుండా యితరులకు ఇవ్వాలని మల యప్పన్ కమిటీ సూచనచేసినదా? అలాంటిసూచన లేనపుడు ఆ భూములు ఆదిమ వాసులకు దక్కేట్లా ప్రభుత్వం ఏమిచర్య తీసుకుంటుంది ?

THE HON. SRI G. LATCHANNA :—ఆ భూములు ఆదిమవాసుల నుండి ఇతరులు తీసుకుంటున్నారనే complaint శాసనసభలో ఇప్పుడు oral గా చెప్పడంతప్ప ఇంతవరకు ఏ complaint రాలేదు.

SRI MAHAMMED TAHSIL :—రెండునెలల క్రితం భద్రాచలం Revenue Divisional Officer గారికి రిపోర్టుచేశాను. ఇప్పటివరకు పొలాలు వారికి యివ్వకుండా వాటిని Colony members కు యిచ్చారు. వాటిని 20 సంవత్సరాలనుంచి కొండప్రజలు చేసుకుంటున్నారు. ఆ colony member sకు యివ్వడం మూలంగా మళ్ళీ క్రొత్తగా పోడుకట్టుకుని వ్యవసాయం చేసుకోవలసి వస్తుంది కాబట్టి పొలం చేసుకుంటున్నటువంటి వాళ్లనుంచి తీసియిచ్చేపద్ధతి కంటె వాళ్లకు క్రొత్తభూములు యిచ్చేట్లా ఏర్పాట్లు చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—గౌరవసభ్యులు ఈ విషయా లన్నీ సవిస్తరంగావ్రాస్తే విచారణచేయించి తగుచర్య తీసుకుంటాను.

4th October 1955]

Sri P. SUNDARAYYA :—స్థానిక ఉద్యోగస్థులకు వ్రాస్తే మీకు పంపరు. మీకు పంపితే స్థానిక ఉద్యోగస్థులకు పంపితేగాని మీకు తెలియదంటారు. ఎవరికి వ్రాయాలి, స్థానిక ఉద్యోగస్థులకా, మీకా ?

THE HON. SRI G. LATCHANNA :—విచారణ చేయించాలంటే అందరినీ కనుక్కోవలసి ఉంటుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మలయప్పన్ రిపోర్టులో ప్రధానముగా పరిశ్రమల విషయములో ఇక్కడ తయారయ్యే forest produce, minerals ఉన్నాయి. వాటిని cottage industries గా implement చెయ్యవలెనన్నారు. అది implement చెయ్యడానికి ఆలోచిస్తారా ?

THE HON. Sri G. LATCHANNA :—Cottage industries గురించి schemes వేసిఉన్నాము. ఈ ఏడాది కొన్ని implement చెయ్యాలని Central Government ను grant అడిగినాము. ఈ సంవత్సరం మొత్తం propose చేసినది 5821 వేల ఖర్చుగలది.

*SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఇప్పుడు పాతపట్నం తాలూకాలో antimalaria, పార్వతీపురం తాలూకాలో yvas స్కీములు ఎంత వరకు అమలులో ఉన్నాయి. ఎంతవరకు పనివచ్చిందో మంత్రిగారు చెబుతారా ?

THE HON. SRI G. LATCHANNA :—సభ్యులు కావాలంటే రిపోర్టు తెప్పించి చెప్పగలను.

SRI P. VENKATASUBBAYYA :—మలయప్పన్ రిపోర్టులో హరిజనులకు నివేశనస్థలాలు ఇచ్చినప్పుడు పట్టణాలలోను గ్రామాలలోను ఇవ్వాలని సూచించారు. ఆ విధంగా కాకుండా ఇప్పుడు ప్రత్యేకస్థలాలు ఇస్తున్నారు. ఆ రకమంతేసను అమలు పరచారా ?

MR. SPEAKER : We are now concerned with Schedule Tribes and not Scheduled Castes.

SRI MAHAMMED TAHSIL :—రంప చోడవరం తాలూకాలో coffee, tea తోటలు పెంచాలని రిపోర్టులో ఉంది. ఆ ప్రయత్నము చేస్తున్నారా ?

THE HON. SRI G. LATCHANNA :—అది Agricultural Department వారు పరిశీలన చేస్తున్నారు.

*Provisions of Section 13 of the Madras General Sales Tax Act.*

562.

*1793 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state why G.O. No. 106, Finance, dated 16—2—1955 was kept in abeyance ?

THE HON. SRI D. SANJIVAYYA :—

In G.O. 106, Finance, dated 16—2—1955 it was ordered that the provisions of Section 13 of the Madras General Sales Tax Act, 1939, requiring dealers and licensees to maintain their accounts in one of the languages viz., Telugu, Tamil, Malayalam, Kannada, Hindustani or English should be kept in abeyance for a further period of one year from the 1st April, 1955.

Representations were made to the Government that enforcement of the provisions of Section 13 of the Madras General Sales Tax Act would result in great hardship to Marwari, Gujarati etc., dealers who are not conversant with any of the languages specified in Section 13 of the Madras General Sales Tax Act. The Government re-examined the question and decided that the provisions of Section 13 of the Madras General Sales Tax Act, 1939, should be kept in abeyance.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, G. O. వల్ల మార్వాడీలు వారి భాషలో లెక్కలు వ్రాస్తే ఇక్కడ అధికారులకు భాష తెలియకుండా వారు ఏమి వ్రాసినా విశ్వసిస్తున్నారు. దానివల్ల ప్రభుత్వానికి నష్టము కలుగుతున్నది. వారు గుమస్తాలను వేస్తున్నారు. వీరిద్దరు షరీకు అయితే మనకు సరియైన లెక్కలుండావు. Sales tax నష్టపడుతుంది. ఆ విషయం ఏమైనా ఆలోచిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :— మార్వాడీ భాష తెలిసిన ఉద్యోగస్థులు ఉన్నారు. వారి సహాయం తీసుకుంటున్నాము. కాని ఈ ఉద్యో

గస్తులు వ్యాపారస్థులుకలిస్తే ప్రభుత్వానికి నష్టంవస్తుందన్నారు. అట్లా కాకుండా ప్రయత్నం చేస్తున్నాము.

Sri T. JALAYYA :—మాట్లాడితే వర్తకులు నష్టంవచ్చేటట్లు చేస్తారు అంటున్నారు. అది న్యాయం కాదు. వర్తకులు గవర్నమెంటుకు నష్టం వచ్చేటట్లు చేయరు. అందు విషయమై ఏమైనా చెబుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Sales tax consumers వద్దనుండి collect చేసి ఇస్తున్నారు. వర్తకులకు ఏమీ బాధ లేదు. వర్తకులు ఎవరూకూడా అన్యాయం చెయ్యరు. చేస్తే అటువంటివి జరగకుండా జాలయ్యగారు చూస్తారని ఆశిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—దానిలో రెండు రకాలు ఉన్నాయి. ఒకదానికి tax ఉండదు. నేనొకసారి శాలువకొనబోతే చీటి లేకపోతే 20/రూపాయలది 30/ రూపాయలు అన్నాడు. Account కాదు, అందువల్ల Sales tax లేదు అన్నాడు. అట్లాంటివి ఎన్నోరహస్యపులెక్కలు వ్రాస్తారు. ఎవరూ వాటిని చూడడం జరుగదు. అందుచేత ఖచ్చితముగా లెక్కలు తేలడానికి మన భాషలో లెక్కలువ్రాసేటట్లు నిర్బంధంచేస్తారా ? గుమాస్తాను వేసుకుంటాడు. నష్టం ఏమీలేదు.

THE HON. SRI D. SANJIVAYYA :—ఒక్క లెక్క కాదు. రెండు మూడు లెక్కలు పెడతారని ప్రభుత్వానికి కూడా తెలుసును. ఎందుచేతనంటే అప్పుడప్పుడు పట్టుకుంటూ ఉంటాము. ఈ మధ్యనే బెజవాడలో 40 లక్షల transaction, డూప్లికేటు లెఖ్ఖలు, పట్టుకున్నారు. కనుక జాగ్రత్తగానే చూస్తున్నాము.

*Clerks working in major and minor Panchayats.*

563.

*1049 Q.—SRI B. SANKARAIAH : Will the Hon'ble the Minister for Local Administration and Prohibition be pleased to state :

The various grades of clerks etc., and their scales of pay, working in major and minor Panchayats allowances ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

The scale of pay of an ordinary clerk in Class I Panchayats is Rs. 35-2-65 and that of a headclerk is Rs. 60-2½-80.

The scale of pay of a clerk in Class II Panchayats with an annul income of Rs. 3,000 to Rs. 5,000 is Rs. 25-1-35 and that of a clerk in panchayats with an annual income of Rs. 5,000 to 10,000 is Rs. 30-1-50.

All the panchayat clerks are paid the dearness allowance at the rates admissible to Government servants.

అధ్యక్షా, ఇప్పుడు major, minor panchayats అనేవిలేవు. ఒకటవ తరగతి రెండవతరగతి పంచాయితీలు ఉన్నాయి. ఒకటవ తరగతి పంచాయితీలో Headclerk కు 60-2½-80, సాధారణ గుమాస్తాకు 35-2-65 జీతం ఇస్తున్నారు.

రెండవతరగతి పంచాయితీలలో, ఆదాయం 3000 నుంచి 5000 రూపాయలు అయితే, 25-1-35 జీతమున్నూ 5000 నుండి 10000 రూపాయలు ఆదాయంవస్తే 30-1-50 జీతమున్నూ గుమాస్తాలకు ఇస్తారు. వారందరికి కూడా ప్రభుత్వ ఉద్యోగస్థులకు ఇచ్చే కరువుభత్యం ఇస్తున్నారు.

SRI B. SANKARAIAH :—ఇటీవల ప్రభుత్వం ఈ రెండవతరగతి పంచాయితీలలో ఉండే గుమాస్తాలుకూడా S. S. L. C. కి appear అయిన వారుగా ఉండాలన్నారు. దానిమీద permanent అయినవారిని కూడా తీసి వేస్తున్నారు. అది ఆపుచేయిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO: —అటువంటి వారు పిటీషనువేస్తే ప్రభుత్వం ఆలోచిస్తుంది.

SRI C. SUBBARAYUDU :—పంచాయితీలకు గుమాస్తాలను వేసేటప్పుడు వాటి ఆదాయమునుబట్టి; ఇంత ఆదాయంఉంటే ఇంతమంది గుమాస్తాలు ఉండాలని నియమము ఉన్నదా ? అవసరం లేకపోయినా Local Boards Inspector గారు కొంతమందైనా ఉండితీరాలని అంటున్నారు. నిర్బంధం ఏమైనా ఉందేమో తెలుపుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఆదాయాన్నిబట్టి నియమాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి.

4th October 1955]

SRI M. NAGI REDDI :—Second class పంచాయితీలకు సమాస్తాలు కనీసము S. S. L. C. : appear అయిఉండాలని ఆర్డరుఉంది. ఈ నియమము కొన్ని పంచాయితీ గ్రామలలో అసాధ్యముగాఉంది. కొబట్టి ఆ qualification తగ్గించవలెనని Andhra State Panchayat Union వారు resolution ప్యాసుచేశారు. దానిమీద ప్రభుత్వం ఏమి చర్యతీసుకొంది ?

THE HON SRI A. B. NAGESWARA RAO :—ఉద్యోగస్థుల నుండి అటువంటి పిటీషను వస్తే ప్రభుత్వం తప్పకుండా ఆలోచిస్తుందని చెప్పాను.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా ! మునిసిపాలిటీలలోను major పంచాయితీలలోను sweeper లకు జీతాలు చాలడంలేదని ఆందోళన జరుగుతున్నది, వారి జీతాలు ఎక్కువ చేస్తారా ?

MR. SPEAKER :—మనము ఇప్పుడు ఈఉద్యోగస్థులను గురించి ఆలోచిస్తున్నాను.

*District Agricultural Officers, etc.*

505—

* 42 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) (1) the number of District Agricultural Officers;

(2) Additional District Agricultural Officers;

(3) Agricultural Demonstrators in the State now; and

(b) the number of Harijans out of them ?

THE HON. SRI B. GOPALA REDDI:

(a) (1) and (2) :—There are 35 officers in the category of District Agricultural Officers;

(3) There are 446 Upper Subordinates (Agricultural Demonstrators and Research Assistants) ;

(b) There are 2 Harijans among the District Agricultural Officers and 10 Harijans among the Upper Subordinates.

SRI S. VEMAYYA :—పదిమందే ఉన్నారు. అన్నారు ఇంక ఎక్కువ మంది హరిజనుల తీసుకోడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Qualified హరిజనులు లేనప్పుడు ఏమి చెయ్యమంటారు?

SRI B. RATNASABAPATHY SETTY :—N. G. O. లు native districts లో officers గా ఉన్నారు. ఇది ఇదివరకు వున్న రూల్సుకు వ్యతిరేకం. ఇప్పుడు ఏమైనా ఆలోచిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అంత వ్యతిరేకత ఏమీ లేదనుకుంటున్నాను. District Agricultural Officer గా ఎవరూ లేరు. అందరు జిల్లా ఆఫీసర్లను గురించి అడిగితే వేరే ప్రశ్న వెయ్యండి.

*Somasila Project.*

506—

* 420 Q.—SRI G. YELLAMANDA REDDY : Will the Hon. the Deputy Chief Minister be pleased to state —

(a) whether the investigation of Somasila Project is completed;

(b) if so, whether the Government will be pleased to place a copy of the report on the Table of the House; and

(c) whether the Government recommended this project to be included in the Second Five-Year Plan ?

THE HON. SRI N. SANJEEVA REDDI :

(a) The answer is in the affirmative.

(b) The report is treated as confidential at this stage, and cannot be placed on the Table of the House.

(c) Yes.

***Eligibility for inclusion in the Deputy Tahsildars' list.***

**507—**

* 925 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether there is any rule that clerks who are otherwise qualified for inclusion in the list of Deputy Tahsildars should not be included in the list unless they put in two years of service as upper division clerks,

(b) whether the Government have granted any exemptions from the operation of this rule; and

(c) if so, the number and the names of those persons to whom such exemptions were granted ?

THE HON. SRI K. CHANDRAMOULI :—*Clause* (a) Yes According to rule 7 (*b*) of the Andhra Revenue Subordinate Service Rules, read with the annexure to it, a candidate before the inclusion of his name in the list of approved Deputy Tahshildars should serve for a period of two years as an upper division clerk.

(b) No.

(c) Does not arise.

SRI M. RAJESWARA RAO :—ఈ రెండు సంవత్సరాలు Upper Division గుమస్తాగా service in ఉండవలెను అనేది క్రొత్తగా పెట్టారు. దానిలో ప్రభుత్వ ఉద్దేశము ఏమిటో తెలియచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—క్రొత్తగా తీసుకువచ్చిన రూలు ఏవీ కాదండి. ఇదివరకటి రూల్సు ప్రకారమే జరుగుతున్నది.

SRI S. VEMAYYA :—అసలు ఈ రెండు సంవత్సరాలు Upper Division Clerk గా పనిచెయ్యాలనేది లేకుండా చెయ్యడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

(NO ANSWER)

*Attacks and deaths from Malaria.*

508—

* 91 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) (1) the number of attacks from Malaria; and

(2) deaths for the year ending 1954; and

(b) the preventive measures taken to combat this disease ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) (1) and (2) : There being no legal provision that cases of attacks of Malaria should be reported to the Health authorities, particulars regarding attacks of Malaria are not available. Number of deaths due to Malaria reported to the local Registrars of Births and Deaths in 1954 are :—

| | | | |
|---|---|---|---|
| In Municipalities | ... | ... | 235 |
| In Other areas | ... | ... | 3272 |
| | | Total | 3507 |

These figures are only provisional as there are many fevers which stimulate Malaria.

(b) The following preventive measures were taken to combat Malaria.

(i) Indoor residual spraying of houses with D.D.T.

(ii) Intensive distribution of Anti-Malaria drugs..

(iii) Employment of special staff for the control of the epidemic.

మలేరియా వచ్చినటువంటి వారు నిర్బంధంగా ఆరోగ్యశాఖాధికార్లకు మలేరియా వచ్చిందని చెప్పి నివేదికలు పంపించుకోవలసినటువంటి నియమంలేదు. కనుక దీని విషయమై జవాబు చెప్పడం కొంతకష్టం. ఐనప్పటికీ స్థానికంగా ఉన్నటువంటి జననమరణ record లో 1954 సంవత్సరంలో నమోదు చేయబడిన ప్రకారం మ్యునిసిపాలిటీలలో 235, ఇతర ప్రదేశాలలో 3272 వెరసి 3507 మందికి ఈ జబ్బులు వచ్చాయి. ఇవి తాత్కాలికమైనటువంటి అంకెలే అని చెప్పవలసి యుంటుంది. ఇక రెండో భాగానికి జవాబు—ఈదిగువ రీతిని మలేరియాతో పోరాడడంకోసం [ఇక్కడ combat అని ఉన్నదండి దానికి తెలుగులో పోరాటం అని చెప్పాను.] ఒకటి గృహాలలో D. D. T. అనే మందును వేయడం, రెండు మలేరియా జబ్బు కుదిర్చేటటువంటి మందులను ఎక్కువగా గ్రామాలలో పంచి పెట్టడం. తరువాత ప్రత్యేకమైన సిబ్బందిని పెట్టి, ఇటువంటి అంటువ్యాధి ప్రబలం కాకుండా చూడడం, ఈవిధంగా చర్య తీసుకుంటున్నారు.

SRI S. VEMAYYA :—గ్రామాధికార్లకూ, పంచాయితీ బోర్డులకు క్వైనా వగైరాలు ఉచితంగా ఇచ్చి ఈ జబ్బు అరికట్టే ప్రయత్నం ప్రభుత్వం చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—దానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాం. ప్రతివాడి చేతికీ మందిస్తే అసలు రోగే కనిపించదేమో అనిభయం.

SRI P. RAJAGOPAL NAIDU :—రాష్ట్రంలో అన్ని జిల్లాలలోనూ Malarial tracts అని ఏమైనా విభజించి ఉన్నారా?

THE HON. SRI K. VENKATA RAO :—అనంతపురం జిల్లాలో కదిరి, ఉరవకొండ కల్యాణదుర్గం, చిత్తూరు జిల్లాలో మదనపల్లి వాయల్పాడు, చంద్రగిరి, నెల్లూరు జిల్లాలో కనిగిరి, కడప జిల్లాలో రాజంపేట రాయచోటి విశాఖపట్టణం జిల్లాలోనూ, తూర్పు గోదావరి జిల్లాలోనూ అనేక చోట్ల మలేరియా ఉన్నది. ఇప్పుడెక్కువగా కర్నూలులోకూడా ఉందని ఈమధ్య complaints వస్తున్నాయి.

SRI N. C. SESHADRI :—ఇప్పుడు మంత్రిగారు Malarial tracts అని కొన్ని ప్రదేశాల పేర్లు చదివారే అక్కడ వాస్తవానికి మలేరియా లేదన్న విషయం వారికి తెలుసునా.

THE HON. SRI K. VENKATA RAO :—ఇన్ని చోట్లకి నా మిత్రుడు ఎల్లా వెళ్ళి మలేరియా లేదని తెలుసుకువచ్చాడో నాకు ప్రస్తుతం అర్థం కావడంలేదు.

SRI M. NAGI REDDI :—గ్రామాలలో మలేరియా తగ్గడానికి Quinine tablets పంచిపెట్టడానికి ఏర్పాటు చేశామని మంత్రిగారు సెలవిచ్చారు. కాని పల్నాడు తాలూకాలో Health Inspectors దగ్గరకు ఎప్పుడు వెళ్ళినప్పటికీ మాకు stock లేదని చెబుతూ మీరు M. L. A. లు కదా, అక్కడే ఆందోళన చెయ్యరాదా, మమ్మల్ని అడిగితే మేమేమి చెబుతాం అంటూ ఉంటారు. అందువల్ల Quinine stocks Health Inspector లకు పంపుటకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందా? 1953 సంవత్సరంకంటె 1954 సంవత్సరంలో Malaria attacks పెరిగాయా, లేక తగ్గాయా మంత్రిగారు సెలవిస్తారా.

THE HON. SRI K. VENKATA RAO :— రెండో విషయమై వివరాలు లేవు. మొదటివిషయంలో Health Inspectors దగ్గర లేకపోతే వారంతట వారు report చేసుకుని తెప్పించుకోని వాళ్లను punish చేస్తాం. ఒక వేళ వారు ఇచ్చినవి ఉపయోగించుకోకపోతే punish చేస్తాం. అసలు లేకపోతే ఆపై ఆఫీసరును punish చేస్తాం.

SRI SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, కనిగిరి తాలూకాలో పండువగండి దగ్గర పనిచేసే కూలీలు మలేరియా జబ్బువల్ల చాలా కష్టపడుతున్నారు.

ఆదేశకంగా ప్రాజెక్టులవద్ద పనిచేసే కూలీలకు మలేరియా రాకుండా అరికట్టుటకు ప్రభుత్వం ప్రయత్నిస్తారా.

THE HON. SRI K. VENKATA RAO :—తప్పకుండా.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, malaria squads ని ఇంకా ఎక్కువ ప్రాంతాలలో ఉండేటట్లు చేసి, మలేరియా అరికట్టుటకు ప్రయత్నిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఒక్కొక్క మూల నుంచే దోమలను మచ్చుమాపేయత్నం చేసుకొస్తున్నాం. క్రమేణా అన్ని ప్రదేశాలకీ దీన్ని ఉపయోగించాలని కోరిక.

SRI C. SUBBARAYUDU :—ఈ మలేరియా attacks తగిలి చని పోయినటువంటి వారిలో ఎంతమంది హరిజనులో చెప్పగలుగుతారా ? ఇప్పుడు లేక పోతే ఇకముందైనా లెక్కలు తీయించడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ జ్వరాలూ, ఈ జబ్బులూ, ఈ అంటువ్యాధులూ హరిజనులనీ, సిరిజనులనీ వ్యత్యాసం చూపించవు. ఇవతల సుబ్బరాయుడుగారు మొదలుకొని అవతల గున్నయ్యగారిదాకా తగులుకుంటూనే ఉంటాయి.

SRI P. KODANDARAMAYYA :—మలేరియాకు పుట్టినిల్లయినటువంటి agency ప్రాంతంలో మలేరియా పోవడంకోసమై గవర్నమెంటు ఏమిఏర్పాట్లు చేశారో వివరంగా చెప్పగలరా ?

THE HON. SRI K. VENKATA RAO :—వివరంగా చెప్పలేనుగాని ఏర్పాట్లు చేశాం. D. H. O. సహాయంవల్ల చాలా malarial squads East Godavari, విశాఖపట్టణం జిల్లాలలోని agency ప్రాంతాలలో పనిచేస్తున్నాయి. అనేకలక్షల రూపాయలు దానికోసం ఖర్చుకూడా అవుతోంది.

SRI B. SANKARAIAH :—నెల్లూరు జిల్లాను గురించి చదివేటప్పుడు కనిగిరి అని చదివారు. సముద్రప్రాంతాలలో అసలు మలేరియా ఎక్కువగా ఉంది. నెల్లూరుజిల్లాలో ఇదివరలో రామతీర్థం అనేటటువంటిచోట ప్రత్యేకంగా దీనికి ఒక hospital ఏర్పాటు చెయ్యాలని గవర్నమెంటుకు సూచనలుకూడా ఇచ్చారు. అటువంటివి అమలు జరుపుతారా ? మలేరియా ఎక్కడెక్కడ ఎక్కువగా ఉన్నదని సరియైన విచారణ చేయిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—మలేరియా కొంచం హెచ్చుతగ్గుగా సర్వవ్యాప్తం అవుతోంది. ఈరోజులలో కావలసినంత చర్య తీసు

కుంటున్నాం. ఒక్కొక్కచోట జయం పొందినకొలదీ మిగతావాట్లకు తీసుకువెడు తోంటాం. అన్ని ఊళ్లలోనూ ఇంతడబ్బు ఖర్చుపెట్టడమంటే కష్టమౌతుంది. ఇప్పటికే బళ్లారిలో, కడపలో, విశాఖపట్టణం జిల్లాలో చాలా units పెట్టారు. వాటినిగురించి research చెయ్యడానికి ఎంటమలాజికల్ అసిస్టెంట్లను వీళ్లందరినీ కూడా వేశారు. Reserve Health Inspectors ని కూడా పెట్టారు. చాలా మందిని వినియోగిస్తున్నాం. ఒక్కొక్కచోట ఐపోయినకొలదీ ముందుకు వెళ్లటానికి వీలవుతుంది.

SRI D. GOPALA RAO: Mr. Speaker, Sir, Since malaria is spreading beyond Agency tracts, may I know whether Government propose to undertake aerial spraying of D.D.T.

THE HON. SRI K. VENKATA RAO:—ఇంకా అసలు భూమి మీద నడవడానికే ఆస్కారం లేకుండావుంది. ఈ ప్రభుత్వానికి ఆకాశంలో ఎగిరేటటువంటి శక్తి ఇంకా కల్గలేదు.

SRI P. VENKATASUBBAYYA:—మలేరియావున్న ప్రాంతాలలో Railway Department లోని Railway Servants కు special allowance అని మూడు రూపాయలవరకూ ఇస్తున్నారు. అదేమాదిరిగా మలేరియా ఉండే ప్రాంతాలలో ప్రభుత్వోద్యోగులకుకూడా ఇస్తారా?

MR. SPEAKER:—అదివేరే question అండి.

THE HON. Sri K. VENKATA RAO:—ఇవ్వవచ్చునని rule వున్నది. ఎక్కడిస్తున్నారో నాకు సరిగా తెలియదు.

SRI M. NAGI REDDI:—నాగర్జున సాగర్ ప్రాజక్టు ప్రాంతానికి పనులకొరకూ, నాగార్జునకొండ excavation పనికొరకూ వివిధప్రాంతాలనుంచీ జనం ఎక్కువగా వస్తున్నారు. అవి మలేరియా ప్రాంతాలు. వచ్చేవి నవంబరు, డిసెంబరు చలికాలం, మలేరియా వస్తుంది కొబట్టి వెంటనే కొంతమంది Health Inspectors ని, Sanitary Inspectors ని వెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO:— Nagarjunasagar అక్కడ మొదలుపెడితే మాచర్ల ప్రాంతంలోయుండే జనానికి బాగా పని దొరుకు తుందని నేను అనుకుంటున్నాను. అప్పుడే పైవాళ్లు వస్తున్నారంటున్నారు. నాగి రెడ్డిగారు కొంచం propaganda చేసి స్థానికంగా ఉండేవారిని ఈపనికి పంపిస్తే మంచిది. పైనుంచి వచ్చేవారు ఎక్కువగా వున్నప్పుడు మలేరియా తగ్గించటానికి అసలు scheme లోనే arrangements ఉన్నాయి.

*Sriharikota Islands.*

509—

* 629 Q.—Sri P. GOPALAKRISHNA REDDY (put by Sri S. Vemayya) : Will the Hon. the Minister of Elctricity and Social Welfare be pleased to state—

(a) whether the Government have received any representation from Sri P. Gopalakrishna Reddi on 28th April 1955 requesting that the Government may be pleased to declare Sriharikota islands in Nellore district as Agency Areas and construct road from Sriharikota to Sullurpet; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) Yes, Sir.

(b) As there are no Scheduled Tribes living in Sriharikota Island in Nellore District, it cannot be declared as a Scheduled Area. As regards the construction of a road from Sriharikota to Sullurpeta, the matter is under consideration.

(a) ఔనండి. (b) నెల్లూరుజిల్లాయందలి శ్రీ హరికోటద్వీపంలో Scheduled తెగవారెవ్వరూ నివసించియుండని కారణంచేత దాన్ని Scheduled ప్రాంతంగా నిర్ణయించుటకు వీలులేదు. శ్రీహరికోటనుండి సూళ్లూరుపేటకు road నిర్మాణంగురించి Highways డిపార్టుమెంటువారు పరిశీలిస్తున్నారు.

Sri S. VEMAYYA :—ఇది ఏజన్సీ ప్రాంతంకంటేకూడా అధ్వాన్నంగానేఉంది. ఒకదఫా అక్కడికి మంత్రిగారు వెళ్ళిచూచి దీన్ని Agency area లో కలపడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా.

The Hon. Sri G. LATCHANNA :—ఏజన్సీ ప్రజలుండేది ఏజన్సీ ప్రాంతము. మిగతా అధ్వాన్నస్థితిలో ఉన్నదంతా వెనుకబడినప్రాంత్రం. దీన్ని అభివృద్ధి చేస్తారు, దాన్ని అభివృద్ధిచేస్తారు.

Sri A. C. SUBBA REDDI :—రెండవప్రశ్న అంటే రోడ్డువేయటానికి ఆలోచన ఏమైనాఉందా అనేదానికి జవాబు చెపుతారా.

The Hon. Sri G. LATCHANNA :—పరిశీలుస్తున్నారని మనవిచేశాను.

SRI B. SANKARAIAH :—అక్కడ చాలా వెనుకపడిన ఏనాదులు నివసిస్తున్నారు. అక్కడవాండ్లకు కొంత facilities కలిగించేదానికి రోడ్డుపని త్వరగా పూర్తిచేసేదానికి ప్రభుత్వం గట్టిచర్యలు తీసుకొంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—రోడ్డు నిర్మాణం గురించి Highways వారు పరిశీలుస్తున్నారని మనవి చేశాను.

*Panchayat Courts in the State.*

510—

* 274 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of panchayat courts in the State; and

(b) the number of cases disposed of for the year ending 1954 ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) 2047.

(b) 14,702.

*Collection of special fees in High Schools.*

511 —

*328 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government are aware that the High Schools are collecting special fees from the students; and

(b) if so, (i) how much from every student; (ii) under what head; (iii) how the amount is spent; and (iv) whether the accounts are audited ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) (i), (ii) and (iii). A statement* is placed on the table of the House.

(iv) The accounts relating to the special fees referred to in items 2, 3, 5, 7, 8, 9 and 10 of the Local Bodies are audited by the Local Fund Audit Department and those relating to Aided Secondary schools by the Departmental auditors.

---

*Vide appendix at page infra.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, ఇక్కడ ఇచ్చిన అంకెల ప్రకారం దీనిని అదనంగా High schools లో వసూలు చేస్తున్నారు అనేది ఒకటిఉంది. రెండవది ఈ డబ్బు ఖర్చుపెట్టేటప్పుడు అసలు audit కు రాకుండానే ఎవరో Visual education అనే పేరుతోటి కాకినాడకో ఇంకే వూరికో వెళ్ళి అయినఖర్చుఅంతా పైన ఉన్న పెద్దలు మాత్రం వేసుకొని విద్యార్థులకు ఏమి ఇవ్వటంలేదని, మూడవది Examination వచ్చినపుడు వాండ్లకు కాగితములు ఏమి ఇవ్వకుండా Examination fees వసూలుచేస్తున్నారని ప్రభుత్వ దృష్టికి వచ్చిందా? వస్తే ఏమిచేయదలచుకొన్నారు? లేకపోతే ఇటువంటి పొరపాట్లను దిద్దుతారా?

THE HON. SRI B. GOPALA REDDI:—ఏమి వసూలుచేసినప్పటికిని అదిఅంతా Audit కు తీసుకొని రావలెననిచెప్పి ఇటీవల strict instructions కూడా ఇచ్చినారు. ఆమాదిరి పొరబాట్లు ఇంతకుముందు జరిగినా, ఇకముందు జరుగదు.

Sri PILLALAMARRI VENKATESWARLU:—ఏఏ పద్దుక్రింద వసూలుచేస్తారో ఆపద్దులక్రిందనే ఖర్చుపెట్టేటట్లు చూస్తారా.

THE HON. SRI B. GOPALA REDDI:—Yes, తప్పకుండా.

12 Noon.

Sri D. KONDAIAH CHOWDARY:—ఈ Special fee కాకుండా నిన్న మొన్నకూడ మరల నెల్లూరుజిల్లా District Board ప్రతి High School లో విద్యార్థిదగ్గరరూపాయో ½ రూపాయో ప్రత్యేకంగా, ఇపుడు జీతం ఎక్కువచేసి, వసూలు చేస్తున్నారు. ఈ విషయమై విద్యార్థులలో చాలా ఆందోళన జరుగుచున్న విషయం ప్రభుత్వానికి తెలుసునా? అట్లుతెలిస్తే ప్రభుత్వం ఎట్టి చర్యలు తీసుకోబోతుంది?

THE HON. SRI B. GOPALA REDDI:—నెల్లూరుజిల్లాలో ఏమి జరుగుతుందో నాకు రిపోర్టురాలేదు. కొండయ్యచౌదరిగారు చెప్పినారు. కాని తూర్పు గోదావరిజిల్లాలో నేను మొన్న రాజమండ్రికి పోయినపుడు అక్కడ రామచంద్రాపురం వగైరాల students అంతావచ్చి చెప్పినారు. High schoolలో ఇంతవరకు జీతాలు హెచ్చించవచ్చునని 1950 వ సంవత్సరంలో G. O. ఒకటి pass చేసినారు. అన్ని జిల్లాబోర్డులలోకూడ అంతవరకు హెచ్చించలేదు. కాని ఇటీవల Vasudevan కమిటీవారి రిపోర్టు ప్రకారంగా అన్ని High schools, District Board లు deficit గా ఉన్నవి. అన్న కారణంతో వాండ్లు చేసిన శిఫార్సులను అనుసరించి ఆ G. O. కు మించకుండా ఈనాడు అక్కడక్కడ జీతాలు ఎక్కువ చేస్తున్నారు.

SRI B. SANKARAIAH :—నెల్లూరుజిల్లాలో అందరు కావలిలో పెద్ద సమావేశంజరిపి తీర్మానాలు pass చేసి ప్రభుత్వానికి పంపించారు. జిల్లాఅంతా పెద్ద ఆందోళనగాఉంది. అందువల్ల ఆ పెంచినటువంటి దానిని అమలు జరుగకుండా చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ సమావేశం సమావేశ తీర్మానాలు నాకేమీ తెలియవు. నేను చూడలేదు. కాని ఇది జిల్లాబోర్డు deficit ను తీసివేయడానికోసం చేసిన ప్రయత్నం. చాలామంది, వందలకొలది విద్యార్థులమీద, వాండ్ల తల్లితండ్రులమీద పడేటటువంటిది స్వల్పంగా ఉంటుంది. కాబట్టి ఇది అమలు పరచాలనే ప్రభుత్వంయొక్క ఉద్దేశం.

SRI S. RANGANATHA MUDALIAR : Is it not exhorbitant to collect Laboratory fees and Literary Association fees at the rate of Rs. 1-8-0 and 1-8-0 from students of I to III forms and is it not a source of trouble to poor parents and will the Goverment see that the fees are lessened at least to some extnet ?

THE HON. SRI B. GOPALA REDDI : We shall examine the question in consulattion with the Headmasters.

*Total extent of land taken over under the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act, 1948.*

513—

*951 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the total extent of land taken over under the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act, 1948 and surveyed in each district and in each taluk of Krishna district by the Special Survey Settlement staff appointed for the purpose up to 31st March 1955;

(b) the total extent of such land still pending survey by the special staff on 31st March 1955; and

(c) the total expenditure incurred on such, staff up to 31st March 1955 since their appointment ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(*a*), (*b*) *and* (*c*) :

The particulars required are placed on the table of the House*.

---

*Vide Appendix at page infra.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, 1955 లో ఉంది, 1959 నాటికి పూర్తి అవుతుందని చెప్పుతున్నారు. కాని ఇప్పటివరకు ఒక్క కృష్ణా జిల్లా లెక్కలు చూసుకొంటే 2/5 వంతు మాత్రమే సర్వే పూర్తి అయిందని తెలుస్తూ ఉంది. ఇన్నిసంవత్సరాలనుంచి చేసినప్పటికికూడా, 1958 నాటికి పూర్తి చేయాలంటే ఎక్కువ staff పెంచాల్సిన అవసరం వుంది. దాని విషయం ప్రభుత్వం ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—1954 లెక్కల ప్రకారం ఇపుడు వారు అడిగారు. మేము ఇచ్చామండీ. తరువాత staff ను ఎక్కువ పెంచాము. ఇంకా చాలాభాగం అయిపోయింది. Progress మాత్రం చాలా ఎక్కువగ జరుగుతుంది.

*Survey of lands in taken over Estates.*

513-A—

* 233 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the number of ryotwari villages in the State now ;

(b) the number of villages in taken over states in which survey of lands was completed; and

(c) yet to be completed for the year ending 1954?

THE HON SRI K. CHANDRAMOULI :—

(a) 7130

(b) 1925

(c) 7244

SRI S. VEMAYYA :—ఈ 7130 లో, estate నుంచి తీసుకొన్నటు వంటి గ్రామాలుకూడ కలసి ఉన్నాయా ? లేకపోతే లోగడ ఉన్నటువంటి రైత్వారీ గ్రామాలేనా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పటికి వారు ప్రశ్న చేసిన రోజుకి రైతువారీ గ్రామాలుగ ఉన్నటువంటి వాటి సంఖ్యండీ.

SRI S. VEMAYYA :—ఈ సర్వే పూర్తి అయికూడ taken over గ్రామాలన్నీ ఆక్కడ, దరఖాస్తులు వగైరాలు పెట్టుకొన్నపుడు, సర్వేఅయినా కూడా ఏదో కోర్టులో తగాదా ఉందని assignments కూడా ఆపివేశారు. దానిని గురించి ప్రభుత్వం ఏదైనా చర్య తీసుకొంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ విషయం నాకు తెలియదు కానండి, కోర్టులో ఉంటే మాత్రం తీసుకొనటానికి లేదు.

SRI YERUKU NAIDU :—అధ్యక్షా, కొన్ని estate లలో సర్వే జరుగుతూ ఉండగా, సర్వే కాని estate లలో కూడా, contempt చేత కొన్ని estate అధికారులు దయా దాక్షిణ్యం లేకుండా శిస్తులు హెచ్చు చేస్తున్నారు, అటువంటి దానిని ఆపుచేయుటకు ప్రభుత్వం చర్య తీసుకొంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఏమైనా అన్యాయంగా ఎక్కువ శిస్తులు వేస్తుంటే ప్రభుత్వం నోటీసుకు తీసుకొనివస్తే తప్పకుండా తగిన చర్య తీసుకొంటుంది.

*Bore wells dug in the State.*

514—

* 131 *Q.*—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of bore wells dug by Government in the State; and

(b) the number of them in good condition?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) 218

(b) 63

THE HON. Sri K. VENKATA RAO:—A. ఈ రాష్ట్రీయములో మర బలంచేత త్రవ్వబడినటువంటి నూతుల సంఖ్య 218.

B. అందులో బాగా ఉన్నవి 63.

SRI S. VEMAYYA :—218 బావులు ఉంటే అందులో 63 మంచివి. అంటే మిగతా అన్ని చెడిపోయి ఉన్నాయా ? ఆ చెడిపోయిన వాటిని బాగుచేయటానికి ప్రభుత్వం చర్య తీసుకొంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—మనుష్యులు చేసేపని కాదండి. మరలు చేయాలి. అందుచేత మళ్లీ మరలు ఏమైనా చేయడానికి వీలు ఉంటే చేయిస్తాం.

SRI V. VISWESWARA RAO :—ఈ మర బలంతో త్రవ్వబడిన బావులు కొన్ని సగం త్రవ్వి విడిచిపెట్టేశారు. వాటి అన్నిటిని పూర్తి చేయడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నం చేస్తుందా అండీ.

THE HON. SRI K. VENKATA RAO :—అంటే అక్కడికి పంపించిన మరలు అంత శక్తివంతంగా పని చేయలేదన్నమాట.

*House-sites to the Harijans of Utakal village of Rayadrug talug*

515—

* 845 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether it is a fact that the Government have withdrawn land acquisition proceedings for the provision of house-sites to the Harijans of Utakal village in Rayadrug taluk of Anantapur district; and

(b) if so, the reasons therefor?

THE HON. SRI G. LATCHANNA :—

(a) Yes, Sir.

(b) Acquisition of land for provision of house sites to Harijans of Utakal Village in Rayadrug taluk was approved in the Composite State in May, 1953

During the separation of the Andhra State, Rayadrug was included in Anantapur District, The District Welfare Officer, Anantapur visited the village on 12th October, 1954 and found another suitable vacant land in the village site poramboke. Hence acquisition proposals were withdrawn in March, 1955.

(a) అవునండి.

(b) గవర్మెంటు పోరంబోకు ఒకటి ఉన్నందువల్ల ఈ private land acquisition withdraw చేయడం అయినది.

SRI S. VEMAYYA :—ఈ Land acquisition ప్రారంభించక పూర్వం అక్కడ Government భూమిఉన్నసంగతి ప్రభుత్వానికి తెలియదా?

THE HON. SRI G. LATCHANNA :—Composite State లో 1953 May లో ఈ proposal చేయబడ్డది. బళ్లారి జిల్లా కలెక్టరుగారిచేత ఈ గ్రామం దరిమిలా అనంతపురంజిల్లాకు చేర్చబడ్డది. అనంతపురం జిల్లా Welfare ఆఫీసరు విచారించడానికివెళ్ళి అక్కడ ప్రక్కనే పోరంబోకు S. No 139 ఒకటి ఉండబట్టి ప్రయివేటుభూమి కొనవలసిన అవసరంలేదని కలెక్టరుగారి రిపోర్టుమీద withdraw చేయడమైనది.

SRI M. NAGI REDDI :—ఈ Land acquisition proceedings జరిగి, తరువాత Gazette publication అయిన తర్వాతకూడ, అక్కడ కొన్ని

గ్రామాలలో ఉండేటటువంటి భూస్వాముల ఒత్తిడిమూలకంగా, ఆ proceedings అన్నీ ఆపివేసి Gazette publication కూడ రద్దుచేసి మళ్ళీ వేరేచోట్ల ఇవ్వడానికో లేక అసలు ఇవ్వకుండా ఉండడానికో ప్రభుత్వం కొన్ని గ్రామాలలో ఇపుడు ఆర్డర్సు పంపించినట్లు తెలుస్తున్నది. కనుక అలాంటివి జరుగకుండా ఒకసారి acquisition proposals వచ్చిన తర్వాత అక్కడ వెంటనే ఇండ్లస్థలులను ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON SRI G. LATCHANNA :—అటువంటి గ్రామాలు వారి జాబితా పంపిస్తే నేను విచారిస్తాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇపుడు ఈ పోరంబోకుభూమిఉంది. దానిని ఇయ్యటానికి proposals వచ్చి నాయనిఅన్నారు. 1953 నుంచి proposals రావడం పోవడం జరుగుతున్నాయి. ఇప్పుడైనా తక్షణం ఆ పోరంబోకు భూమిస్థైనాసరే, వెంటనే వారికి ఇప్పించడానికి ప్రభుత్వం ఏమైనా ఆర్డర్లు జారీచేస్తుందా ?

THE HON. SRI G. LACHANNA :—పోరంబోకు భూమిని ఇవ్వటానికి చర్యతీసుకొంటున్నది. ఈ proposal ఈ సంవత్సరంలో వచ్చిందికాదు. 1955 మార్చిలోనో అంతకు పూర్వమో వచ్చింది, పాతభూమిది. ఇది withdraw చేయడం 1955 మార్చిలో జరిగింది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇప్పుడు Land Acquisition క్రింద కొన్ని proposals వచ్చినతరువాత మళ్ళీ ఏఏగ్రామాలలో జరిగిందో ఆ list నాకు పంపిస్తే విచారణచేస్తానని చెప్పారు. అదికాకుండా, సాధారణంగా ఒక తడవ proposals వచ్చి finalise అయి Gazette లో publish అయినతరువాత మళ్ళీ ఏ పరిస్థితులలోను దాన్ని withdraw చేయకూడదని ప్రభుత్వము ఉత్తరువులు పంపిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఈ proposals లో వచ్చేటటువంటి అభ్యంతరాలు ఒక్క భూస్వాములనుంచే రావడంలేదు. ఇప్పుడు నాకు ఉన్న ఈ స్వల్ప అనుభవమునుబట్టి హరిజనులవద్దనుంచికూడ కొంతమంది కావాలని, కొంతమందివద్దనికూడ petitions వస్తున్నాయి. అందుచేత ప్రభుత్వమే తనకు సౌకర్యముగాఉన్న భూమిని నిర్ణయించి, దానిని acquisition చేసి ఇవ్వడమనేది మంచిపద్ధతి అనుకొంటున్నాను.

SRI P. SUNDARAYYA :—కొంతమంది హరిజనులు కావాలన్నారని, కొంత మంది హరిజనులువద్దని అన్నారని చెప్పారు. వద్దుఅనిచెప్పిన హరిజనులతో ఇండ్లస్థలాలు ఇవ్వకపోయినా, కావాలన్న హరిజనులకు ఇళ్ళస్థలాలు acquisition చేసి ఇస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఫలానా స్థలమువద్దు, ఫలానా స్థలము కావాలఅన్నా కేగాని, మాకు స్థలమువద్దు అనేవారు ప్రపంచంలో ఉండరు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ స్థలం కావాలని కొంతమంది, మరోస్థలం కావాలని కొంతమంది, మొత్తం అందరుకూడ స్థలం కావాలంటున్నారనే చెప్పారు. అటువంటప్పుడు Government Officer ఫలానాస్థలమని నిర్ణయించి, అది Gazette లో publish అయిన తరువాత, కొంతమంది దానికి అభ్యంతరాలు పెట్టించినప్పటికి, అది acquisition అయిపోయి Gazette publication అయిన తరువాత తప్పకుండా ఆ స్థలాలుఇచ్చి తీరాలి అని orders జారీ చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA:—ఎప్పుడు అనవసరంగా ఏదికూడ with law చేయమనను. ఏదో భూస్వాములు చెప్పేదంతా చేస్తున్నదనే వాదనను ప్రభుత్వము ఎప్పుడుకూడ ఆమోదించను. ప్రభుత్వము తనకు ఏ స్థలము ప్రత్యేకించడానికి సుకరంగాఉంటే, దాన్ని నిర్ణయించి ఇవ్వడమనే పద్ధతిమీద వ్యవహారము చేస్తూ యున్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—General గా ఫలానాస్థలము acquisition చేయాలని Government officers వ్రాసిన తరువాత, ఎవరో హరిజనులలోనే కొంతమంది ఏదో అభ్యంతరాలు పెట్టినారని, మళ్ళీ వాళ్ళకు వెనుకకు యివ్వడంకంటే, ప్రభుత్వ ఉద్యోగులు ఏ స్థలమైతే యివ్వవలసిందని అంటారో అది వెంటనే ఇవ్వాలనేటటువంటి నిర్ణయం ప్రభుత్వంచేసి పాటించేటట్లు చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—కొన్ని proposals చేయబడి ఉంటాయి. తరువాత తక్కువధరలో ఎక్కువ స్థలముయిచ్చే అవకాశము ఉన్నప్పుడు, ఆ proposals మార్పుచేయడంలోతప్పు ఉండదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—గవర్నమెంటు స్థలము ఉండినట్లయితే, గవర్నమెంటు స్థలమే యివ్వాలని, private land తీసుకోకూడదని orders జారీచేయవచ్చు. అలాచేయకుండా, గవర్నమెంటుస్థలము ఉన్నప్పటికి, ఎందువల్ల వేరే private land తీసుకోవాలి.

MR. SPEAKER : Government may change their mind for several reasons.

SRI PILLALAMARRI VENKATESWARLU :—That is true Sir. కొన్ని కారణాలన్ని విచారణచేసి, ఫలానాభూమి acquisition చేయాలని

MR. SPEAKER : I shall now put the amendments to the vote of the House. I shall first put the amendment of Sri Pillalamarri Venkateswarlu. If that goes, then Sri Vemayya's amendment does not arise. The question is :

> "In clause 3 (2) (b) after the words "District Collector" add " and a second appeal to the Board of Revenue ".

The motion was lost.

MR. SPEAKER : The question is :

> In clause 3 (2) (b) for the words " the prescribed period " substitute the words " a period of two months ".

The motion was lost.

MR. SPEAKER : The question is :

> In clause 3 (2) (c) in line 4 insert the word ' not ' between the words ' Act ' and ' be ' and in line 5 omit the word ' not ', and add at the end ' within a period of three months '.

The motion was lost.

MR. SPEAKER : Since all the amendments have now been disposed of I shall now put the main motion to the vote of the House. The question is :

Clause 3 do stand part of the Bill.

The motion was carried.

Clause 4 was put and carried.

*Clause 5.*

MR. SPEAKER : The motion is :

Clause 5 do stand part of the Bill.

SRI S. VEMAYYA :—Clause 5 క్రింద resume చేసి reassign చెయ్యడానికి అధికారం Government కు ఉంది.

Sri S. Vemayya] [4th October 1955

MR. SPEAKER: We have already considered the amendment of Sri Vemayya. The question of reassigning the inam land does not arise at all. We are not in this clause or in this Bill giving Government power of assignment or resumption of inam land. That power already exists in the Act. This clause is intended only to clear misapprehensions.

SRI P. SUNDARAYYA:—ఈ procedure కు సంబంధించినంత వరకు ఆ clause యొక్క merit వేరు. ఇక్కడ ఒక clause తెచ్చారు. ఇది Amending Bill ఐనా, ఈనాంబిల్లయినా అదివేరే ప్రత్యేకమైన Clause. ఈ Clause లో గవర్నమెంటుకు ఇదివరకు ఈనాంలు resume చెయ్యడానికి కొన్ని అధికారాలున్నాయి. ఆ అధికారాలు ఏమాత్రం మార్పు చెందవని చెప్పి, అవసరమయినా కాకపోయినా ఇక్కడ reiterate చేశారు. కొన్ని అధికారాలున్నాయని చెప్పి reiterate చేస్తున్నారు. ఆ అధికారాలు ఈ పరిమితికి లోపల ఉంటాయని చెప్పేదానికీ, లేకుంటే ఆ అధికారాన్ని కొంచం పొడిగించమని చెప్పేదానికీ ఇది ఏ రీతిగా బిల్లు ఉద్దేశ్యానికి వ్యతిరేకం? Resumption of service inams అనే clause కనుక లేకపోయినట్లయితే, మీరు చెప్పినట్లు ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యానికి ఆయనపెట్టిన clause వ్యతిరేకం కాబట్టి లేదనిచెప్పవచ్చు అనుకోండి. కాని ఈ clauseలో అటువంటి హక్కుందనిచెప్పి ఇక్కడ తెచ్చినప్పుడు ఆ హక్కును ఇంకా కొంచం పొడిగించమని చెప్పడానికి మాకు హక్కుంది.

THE HON. SRI K. VENKATA RAO:—అదికాదండి. Just for the purpose of levying the assessment on inam lands this clause is put in here.

మేము కొత్తగా ఏమీ power తీసుకోవడంలేదు.

MR. SPEAKER: A person has already alienated his inam to a third party and that third party is in possession of the land. Are you going to issue a patta to the person who has already assigned the inam land to another person? So I hope Mr. Vemayya will not move his amendment.

SRI S. VEMAYYA: I am not moving my amendment.

Clause 5 was put to vote and carried.

Clause 6 was put to vote and carried.

Clause 7 was put to vote and carried.

Clause 8 was put to vote and carried.

*Clause* 9.

MR. SPEAKER: The motion is:

Clause 9 do stand part of the Bill.

SRI P. SUNDARAYYA: Mr. Speaker, Sir, I move—

In Clause 9 make the existing clause as sub clause (i) and add the following as new sub clause (ii):

"(ii) All such orders shall be published in the ANDHRA GAZETTE and upon such publication shall take effect as if enacted in this Act. The orders so published, shall be placed on the Table of the Legislative Assembly at the first sitting of the Assembly after such orders are published and shall be subject to such modifications, whether by way of repeal or amendment as the Assembly may make on a motion raised by any member of the Assembly and such motion shall be disposed of within fourteen days from the date on which they are so laid."

The amendment was duly seconded.

MR. SPEAKER: This is something like an amendment to rules. Fourteen days' time is only intended to give sufficient notice to the members to give amendments or modifications if any.

SRI P. SUNDARAYYA:—ప్రభుత్వానికి rule making power ఇచ్చారు. ఆరీత్యాచేసిన rules అన్ని Assembly ముందు పెట్టవలసి ఉంటుంది అని 9 వ క్లాజులో వున్నది. Assembly ముందుపెట్టిన తర్వాత 14 రోజుల లోపల Assembly ఆ రూల్సులో మార్పులు చేయదలచుకొంటే చేయవచ్చును అని వుంది. 14 రోజులలోపల మార్పులు చేసేదానికి అవకాశం ఉంటుందా లేదా అన్నే

Sri P. Sundarayya] [4th October 1955

విషయాన్నిగురించి శాసనసభ రూల్సులో నిబంధన పెట్టుకోవలసిఉంటుంది. అయితే ప్రభుత్వంవారు ఆ rules ను table మీద పెట్టుతారు. మనకు ఏదన్నా అభ్యంతరంవుంటే, సవరణ ప్రతిపాదిస్తాము. ప్రతిపాదించిన తరువాత 14 రోజుల లోపల అది పూర్తికావాలి. కాని Government దానికి ఏమి time allot చేయకపోయినా, లేక 5 రోజులు అయినతర్వాత ఆ అసెంబ్లీని prorogue చేసినా, Table మీద పెట్టినరోజు తరువాత 14 రోజులకు ఆ rules అంగీకరింపబడినట్లేనని ఎంచుకోబడుతుంది. మెంబరు అయినాసరే ఒక ప్రతిపాదన చేసినట్లయితే 2, 3 రోజులలో నోటీసుయిచ్చి వెనువెంటనే తీసుకోవాల్సి వుంటుందని చెప్పి మన rules of procedureను మార్చుకోవచ్చు. అది Assembly procedureకు సంబంధించింది. అయితే ప్రభుత్వం rules ను తయారుచేసిన తరువాత వాటిపైన ఎవరైనా సవరణ చేయదలచుకున్నట్లయితే విధిగా 14 రోజులలోపల చర్చ జరపాలి అని ఖచ్చితమైన నిబంధన చట్టంలో వుండడం చాలా అవసరం. ఇటువంటి సవరణ ఉన్నందువల్ల ఇటువంటి ఇబ్బంది కలుగదు. చట్టాని అమలు జరుపుటకు ఎట్టి అభ్యంతరం ఉండదు.

"If any difficulty arises in giving effect to the provisions of this Act, the State Government may, as occasion may require, by order, do anything which appears to them necessary for the purpose of removing the difficulty." అని ఉంది.

ఈ చట్టాన్ని అమలు పరిచేదానికోసం ప్రభుత్వానికి ఏ ఇబ్బంది వచ్చినా, దానిని ప్రభుత్వం తొలగించేదానికి ప్రభుత్వం ఇష్టంవచ్చిన చర్య తీసుకొనివచ్చును అని చెప్పేసి, చాల విశాలమైన అధికారం వాండ్లకు ఇచ్చివేయడమైనది. దానినే delegated legislative power అని అంటున్నారు.

అందుచేత నా సవరణలో ప్రభుత్వంచేసే నిబంధనలను table మీద పెట్టవలెను; పెట్టినతర్వాత ఏ సభ్యుడైనాసరే సవరణలు పెట్టినపుడు వాటినిగురించి చర్చించి ఒక నిర్ణయం చేయాలని వ్రాశాను. గవర్నమెంటుచేసిన ఆర్డరులన్నీ త్రోసిపుచ్చి సంవత్సరాలకొద్ది గడిపివేయడం నా సవరణయొక్క ఉద్దేశంకాదు. అసెంబ్లీ సమావేశంఅయిన మొదటిరోజే ప్రభుత్వం ఏ ఆర్డరు ప్యాసుచేశారో వాటిని table మీద పెట్టాలి. పెట్టిన తర్వాత ఏ సభ్యుడైనా వాటికి సవరణలు చేయతలచుకుంటే ఒక motion ఇవ్వాలి. ఆ motion ఇచ్చిన తర్వాత ఈ సభ table మీద పెట్టినప్పటినుంచి, 14 రోజులలోపల motion ను చర్చించడానికి అసెంబ్లీ సమావేశం కావాలి.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పుడు 9 వ క్లాజులో ఉన్నటువంటి నిబంధన యుద్ధానంతరం వచ్చిన దాదాపు అన్ని చట్టాలలోను ఉన్నది.

Sri P. SUNDARAYYA :—యుద్ధానంతరం చేయబడిన ప్రతిచట్టంలోకూడ ఇటువంటి అధికారాన్ని మేము తీసుకొన్నామని మంత్రిగారు అంటున్నారు. తీసుకొని వుండవచ్చును. అవి కాదనము. అది fact కూడాను. కాని ఆరకంగా ఒక Act చేసి, ఆ Act ను అమలు జరిపే దానికోసం సర్వాధికారాలు తీసుకొంటూ, ఆ నిబంధనలను కనీసం table మీద అయినా పెట్టి, ఏ సభ్యుడైనా ఏదైనా సవరణ చేయదలచుకొంటే, సవరణ చేసేదానికి అవకాశం ఇవ్వకుండాను, మరల ఒక non-official resolution తేకుంటే ఒక motion తేకుండా, లేకపోతే ఒక Amending Bill ఇచ్చి మార్పు చేయాల్సిన పరిస్థితి, సభ్యులకు కలుగచేసేదానికన్న నాసవరణను అంగీకరించుటంవల్ల చాలా ఉపయోగం కలుగుతుందని అనుకుంటున్నాను.

MR. SPEAKER :—They do not get powers.

Sri P. SUNDARAYYA :—ఆ orders ను table మీద పెట్టి వాటిని ఏ సభ్యుడైనా సవరణలు చేసేదానికోసం అవకాశం కలిగించమనే దీనియొక్క ఉద్దేశం. అందుచేత ఇదివరకు చట్టాలలో లేకపోతే ఆ పాత సాంప్రదాయాలు మనము అనుసరించవలసిన అవసరం ఏమాత్రంలేదు. ఇప్పుడు ప్రభుత్వంవారు అనేక సమస్యలు వచ్చినపుడు ఆరునెలల క్రితమే ప్రభుత్వం అధికారంలోకి వచ్చిందని చెప్పుతూ ఉన్నారు. అయితే ఈవిధంగా delegated powers ఉన్నటువంటిది సందర్భాలలో ప్రభుత్వం చేసిన rules ను తప్పకుండా table మీద పెట్టి వాటినే శాసన సభ అనుమతి తీసుకొనవలెనని కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, 9 వ క్లాసులో "if any difficulty arises in giving effect to the provisions of the Act" అని ఉన్నది. దానియొక్క భావాన్ని అమలు జరపటానికి ప్రభుత్వానికి ఏమైనా administrative difficulties ఉంటే, వాటిని ప్రభుత్వం administrative గా సవరణ చేసుకొని చట్టము యొక్క spirit ను అమలు జరపటానికి వీలవుతుంది. ఈ చట్టాన్ని సక్రమంగా అమలు చేయటానికి కావలసిన రూల్సు చేయటానికి 10 వ క్లాజులో ప్రభుత్వానికి అధికారము ఇయ్యబడుతుంది. చిన్న చిన్న పరిపాలనా వ్యవహారాలు అన్నీ తీసుకొనివచ్చి

Sri K. Chandramouli] [4th October 1955

శాసన సభలో పెట్టాలి అంటే అది అసంభవం. ఏ ప్రభుత్వంకూడ చేయలేదు. ఎక్కడకూడ అది జరుగలేదు. ఈ Act ను అమలు జరపటానికి కావలసిన రూల్సును frame చేసుకునే అధికారాన్ని ప్రభుత్వంవారికి పదియవ క్లాజు రీత్యా దఖలు పరుస్తున్నాము. అయితే ఎప్పుడు ఏరూల్సును frame చేసినా, వాటిని శాసన సభముందు పెట్టవచ్చును. ఆ రూల్సుకు సభ్యులు సవరణలు తేవచ్చును, వాటిని సరిగా చేయవచ్చును. సుందరయ్యగారు ఇంకొక విషయం చెప్పారు. దానిని గురించికూడ నేను చెప్పి ముగిస్తాను. ఇది 14 రోజులు అంటూ ఎప్పుడో పెట్టుతారు. పెట్టగానే మళ్లీ next day prorogue చేస్తారు. ఇటువంటి difficulties వస్తాయి అని కూడా అన్నారు. అట్లాగే ఇపుడు వారుకూడ 14 రోజులు అంటే 14 వ రోజు సాయంత్రం 4-55 నిమిషాలకు ఏదో ఒక amendment తేవచ్చును. కాబట్టి ఈ difficulties అన్ని, it is left to the Chair. You are here to safeguard the interests of the House on both sides.

వాంట్లో ఆ difficulty ఏమిరాదండీ. అందువల్ల అది మీరు చేయవలసి నటువంటి పని, ప్రభుత్వం చేసేటటువంటి పనికూడా కాదు. అదివారుకూడా చెప్పారు. అందువల్ల, we have sufficient trust in you. You are the custodian of the House. అందువల్ల ఆ difficulties వారికి ఏమి రావని నా ఉద్దేశం.

THE HON. SRI K. VENKATA RAO :—కొంతవరకు సుందరయ్య గారు చెప్పింది నిజమే. ఇది ఎపుడో పాత చరిత్రలోనిది కాదు. 1947 తరువాత pass అయినటువంటి అన్ని శాసనాల్లోకూడ ఇలాంటి clauses ఉన్నాయి "if any difficulty arises in giving effect" అని Madras Estates Abolition and Conversion into Ryotwari Act లో కూడ ఉన్నది. అది big Act. ఊరకే సుందరయ్యగారు assessment మీద ఏదో అభ్యంతరం పెట్టుతున్నారు. Village Panchayat Act లో కూడ similar provision ఉన్నది. అన్నిటికంటె ముఖ్యమైన point ఒకటి మనవిచేస్తున్నాను. మంత్రి గారు ఇదేమో Administrative Act అని చెప్పారు. Administrative Act అంటె అది చేసినటువంటి order ఆ Rule క్రింద permanent గా ఉండేది కాదు. ఆ particular circumstances లో వేసినటువంటి order అయిన తరువాత దాన్ని తీసుకువచ్చి ఇక్కడ పెట్టుకుంటారు. అది post-mortem examination అవుతుంది. జరిగిపోయిన దాన్నిగురించి తిరిగి పరీక్షచేసి పాతది restore చేసినట్లు అవుతుంది. Rule అన్నకే ఇక్కడ మీరు approve

చేయడము. అది approve చేసేదాక అమలులోకి రాదు. ఈ 14 రోజులలోను order అన్నది అమలులోకి రాకుండా ఉండదు. Order వేయగానే అది అమలులోకి వస్తుంది. దాన్ని తరువాత approve చేయడమంటే అది post-mortem examination అవుతుంది. దీంట్లో "For the purpose of the Act" అని అన్నారు. దీనియొక్క భావన దాన్ని interpret చేసేవాంట్లో ఉంది. దీనివల్ల major గా, ఈ Legislature యొక్క హక్కులకు గాని administration యొక్క హక్కులకు గాని భంగము రాకుండా చేయడం కోసం ఈ Section పెట్టాముగాని అంతకంటె ఏమికాదు.

SRI P. SUNDARAYYA :—అది clause 10 గురించి ఇచ్చిన అర్థము కాదు. Clause 9 కి వచ్చినప్పుడు ఇది కేవలం Administrative Act అయినట్లయితే, మీరు ఏదో order చేసేటటువంటి executive work అయినట్లయితే, మీరు legislation లో ఎందుకు హక్కు కోరుతున్నారు ? మీరు ఈ clause 9 ఎందుకు పెడుతున్నారు ? అది లేకపోతే వచ్చిన ఇబ్బంది ఏమిటి ? ఈ clause 9 చట్టములో పెట్టకపోతే మీరు చేసే orders Courts లో illegal అయ్యే అవకాశం ఉన్నదని, దీనినుంచి debar చేసుకోవడానికోసం ఇది పెడుతున్నారు. అంతే కాకుండా కేవలం Administrative Act అయినట్లయితే మీకు legal right ఉన్నదని చెప్పుకోడానికి, ఈ clause 9 అవసరంలేదు. ఎప్పుడైతే మీరు కోర్టులో తప్పించుకోడానికి చూస్తున్నారో అప్పుడు అసెంబ్లీకి హక్కు ఉండాలి.

MR. SPEAKER : Any order passed by the Government in the course of administration should not be inconsistent with any portion of the law or rule made under the law.

SRI P. SUNDARAYYA : If your interpretation is correct, then what is the necessity for putting this clause here ?

MR. SPEAKER : Safety.

SRI P. SUNDARAYYA : Safety from whom ?

MR. SPEAKER : Foolproof.

SRI P. SUNDARAYYA : Foolproof from whom ? From Courts only. The only authority that can question them is Court.

[4th October 1955

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇప్పుడు కెంట్రూవుగారు చదివిన రూల్సు ఇవి అమలులోకి రావు, orders మాత్రం అమలు లోకి వస్తాయి. Orders pass అయిన తరువాత, అక్కడికి శాసనసభ ఆమోదానికి వస్తాయంటె, అది post-mortem examination అవుతుంది. అంటె దీంట్లో రూల్సు అమలుకు వచ్చిన తరువాత అసెంబ్లీ ఆమోదానికి వస్తుందన్న మాట.

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రభుత్వము Rules చేసి శాసనసభలో పెట్టి 14 రోజులయిన తరువాత అమలు జరుపుతారు. అంతకు ముందు చేయరు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అయితే నాకొక అనుమానమున్నది. 9 వ క్లాజులో...

MR. SPEAKER :—అది వేరు, ఇది వేరండీ.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—10 క్లాజుకు సంబంధించిందే 9 వ క్లాజు అవుతుంది. నా అనుమానం చెప్పుతాను, దాన్ని కనీసం clarify చేయండి. ఇప్పుడు 9 వ క్లాజులో ఏమి ఉన్నది. "If any difficulty arises in giving effect to the provisions of this Act, the State Government . . . అందువల్ల orders pass చేయవచ్చు అని ఉన్నది. కాని 10 క్లాజు (3) లో ఏమి ఉన్నదంటే "All rules made under this Section shall be published in the Andhra Gazette, and on such publication shall have effect అంటె Gazette లో publish కాగానే, అది effect లోకి వస్తుంది. కాని అసెంబ్లీలో pass చేస్తేనే ఆ rules అమలులోకి వస్తుందని వారు అన్నారు. ఇది కాస్తా clarify చేయండి. Orders అయినాసరే, ఏదైనాసరే శాసనసభలో వచ్చిన తరువాత, ఇక్కడ మారితే అవి మారిన పద్ధతిలో అమలుకు వస్తాయా, లేక దీంట్లో ఉన్నట్లు గానే, as it is rules గాని orders గాని అమలుకు వస్తాయా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Rules కు orders కు distinction గోపాలకృష్ణయ్యగారు తెలుసుకోకుండా ఉన్నారు. Rules వేరు, orders వేరు, మీరు Section 10 క్రింద discuss చేస్తున్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అసలు, subject ఎక్కడ వచ్చిందంటే, సుందరయ్యగారు, orders కూడ ఈ House Table మీద

పెట్టి 14 రోజులు notice తోటి వ్యవహారం చేయాలని అన్నారు. కనుక ఈ రెంటికి తేడా ఉన్నదని చెప్పడం తోటి సమస్య వచ్చింది. అందువల్ల Rules, orders, రెండూ కూడాను శాసనసభముందు ఉంచడం అవసరము. కనుక అటువంటి amendment చేయవలసిన అవసరమున్నదని నేను చెబుతున్నాను.

Mr. SPEAKER : I shall now put the amendment of Sri P. Sundarayya to the vote of the House. The question is:

In clause 9 make the existing clause as sub-clause (1) and add the following as new sub-clause (ii) :

"(ii) All such orders shall be published in th ANDHRA GAZETTE and upon such publication shall take effect as if enacted in this Act. The orders so published, shall be placed on the table of the Legislative Assembly at the first sitting of the Assembly after such orders are published and shall be subject to such modifications, whether by way of repeal or amendment as the Assembly may make on a motion raised by any member of the Assembly and such motion shall be disposed of within fourteen days from the date on which they are so laid."

The motion was lost.

Clause 9 was put to vote and carried.

Clause 10 was put to vote and carried.

Clause 1 was put to vote and carried.

The Preamble was put to vote and carried.

The Hon. Sri K. CHANDRAMOULI : Sir, I move that—

The Andhra Inams (Assessment) Bill, 1955 be passed into law.

Mr. SPEAKER : The motion before the House is :

That the Andhra Inams (Assessment) Bill, 1955 be passed into law.

Sri S. RANGANATHA MUDALIAR : Mr. Speaker, Sir, I want to bring to the notice of the Ministry the objections raised in the select committee by Sri R. B. Ramakrishna Raju and Sri Krishnam Raja Bahadur. The Bill as finally placed

Sri S. Ranganatha Mudaliar] [4th October 1955

before the House to-day does not seem to have considered the objections raised by those two members in the Select Committee. Sri Ramakrishna Raju said that while the grant of inam was required to have been made, confirmed or recognised by Government, no such condition was attached to assigament of land revenue. He said that such assignment need not have been made confirmed or recognised by Government. He also pointed out that certain minor inams will not come within the scope of the Bill and urged for defining the word 'inam' simply as grant of land or assignment of land revenue on land. It is only with reference to that aspect of Sri Ramakrishna Raju's objection that I wish to seek clarification. Sri Krishnam Raja Bahadur also pointed out to the Select Committee that there are certain inams granted to certain people on patta on a nominal quit-rent. He failed to see how the Government could increase the assessment contrary to the original assignment. No satisfactory solution has been given in the Bill to those two objections.

In this connection I wish to bring to the notice of the House certain defects in the Bill now before the House. In Clause 2 sub-clause (b), which deals with the definition of the word 'inam', it is stated, that 'inam' means an inam land as defined in clause (c) or an assignment of land revenue. So according to that definition an inam is of two kinds (1) grant of land in inam and (2) assignment of land revenue. So far the clause is correct and is perfectly understandable. But the addition of the words 'on such inam land' seems to introduce confusion. For, an inam cannot be a grant of land and at the same time assignment of land revenue on the same land. For, the words 'on such land' mean the land mentioned in clause (c). The word 'such' refers to the first part of the inam land referred to in the first part of clause (b). So my submission is an 'inam' cannot be both a grant of land and assignment of land revenue of such land at the same time. So I would suggest to the Government that this confusion would disappear if the word 'such' is omitted and the word 'any' is

introduced in its place. I submit this for the consideration of the Government.

MR. SPEAKER : I think you are too late to suggest an amendment.

SRI S. RANGANATHA MUDALIAR : Too late! Anyhow I am placing this for the consideration of the Government. They are not prevented from accepting my suggestion, if my suggestion contains sense. So I request the Government to have sub-clause (b) thus :

(b) "inam" means an inam land as definded in clause (c) or an assignment of land revenue on any land.

That is, I suggest the words 'on any land' for the words 'on such inam land'.

MR. SPEAKER : So you want to remove both 'such' and 'inam'. Even any temporary assignment of land revenue on jiroyiti land also you want to bring under this Bill.

SRI S. RANGANATHA MUDALIAR : My definition of the term.

MR. SPEAKER : Even without 'such' it makes the same meaning. Without 'such' it does not change the meaning. 'Such' does not connote anything else than an inam land. The word 'such' is used to denote the inam land coming down below in the next clause, clause (c). So with the word 'such' or without the word 'such', inam land cannot denote anything else other than what is contained in clause (c).

SRI S. RANGANATHA MUDALIAR : But, my postion will be made clear if the Government is pleased to consider that there are certain other inams which consist only of assignment of land revenue.

MR. SPEAKER : They will come under clause (c).

SRI S. RANGANATHA MUDALIAR : They do not come under clause (c).

[4th October 1955

Mr. SPEAKER : Then they are not affected by this legislation.

SRI S. RANGANATHA MUDALIAR : I submit there are inams which consist of only assignment of land revenue, and there are different kinds of such inams. I wish to draw the attention of the House here to the second and third proviso of clause 3. The second proviso deals with inams which are only assignments of land revenue ; and the third proviso deals with inams which are village artisan service inams, which are in the shape of land.

MR. SPEAKER : They are exempted. Look at the words—

'provided that the inamdar continues to be in possession and enjoyment of the inam land.

SRI S. RANGANATHA MUDALIAR : Now if the definition in the Bill is accepted there are certain other minor inams not granted on service tenure but which are of the nature of assignment of land revenue, and no provision has been made for them in this Bill.

MR. SPEAKER : They won't be touched.

SRI S. RANGANATHA MUDALIAR : They are omitted. They don't get the benefit of this Bill.

MR. SPEAKER : By levying assessment on land people are not benefited. They are only burdened.

SRI S. RANGANATHA MUDALIAR : They will be liable to pay only jodi or quit rent and not full assessment. There are similarly other inams which are not of the nature of service tenure but which consist only of assignment of land revenue. Those inams also must be included in the proviso. There are several inams in the Karvetinagar Estate which are not assigned as service inams but are assigned as personal inams. Suppose a Purohit, Brahmin or

Poet did some service to the zamindar, they were given inams in the shape of assignment of land revenue. In all such cases the land is in the possession of somebody else. Such inams do not come under this proviso. They should be brought under this Bill ; otherwise it will lead to expropriation.

MR. SPEAKER : When they are not touched by this legislation where is the question of expropriation ?

SRI S. RANGANATHA MUDALIAR : What I say is, in the case of service inams, the inamdars who are liable to pay jodi, quit rent, will be asked to pay full assessment.

Mr. SPEAKER : If they are not covered by this Bill, where does the question of assessment arise ?

SRI S. RANGANATHA MUDALIAR :—What is it Government lose by not adding these inams in this legislation ? I want them also to be included in this legislation. That was the objection raised by Sri Ramakrishna Raju in the Select Committee.

THE HON. SRI K. CHANDRAMOULI :—Shall I explain the position, Sir ?

MR. SPEAKER : You will get a clarification from the Minister.

THE HON. SRI K. CHANDRAMOULI :—Sir, I will explain the position.

ఇప్పుడు రంగనాథ మొదలియార్ గారు కార్వేటి నగరములో ఏవో కొన్ని personal inams ప్రత్యేకంగా వున్నవి అని చెప్పారు. అటువంటి inams విషయముకూడా Select Committee stage లోనే విచారించబడ్డవి. ఇంకను అటువంటివి ఏవైనా ఒకటి, అరవుంటే, వాటిఅన్నిటి విషయములోగూడా విచారణ జరుగుతుంది. కాని దీనిలో expropriation అనేటటువంటిది యేమీలేదు. మైనరుయినాముల మీదకూడ పన్నులు వగైరాలు వేయటానికి అవకాశము ఉంచేటట్లు ఆరూల్సుఅన్నీ చేసేటప్పుడు, చేయుటానికి అవకాశము వున్నది. ఇప్పుడు carpenter smith, వగైరాలు సేదవాళ్లు servicedars గా వున్నారు. వారికిమాత్రము యీ అదనపుపన్ను వుండదు. Service inams అని వేరే కొన్నివున్నవి. వాటిలో

Sri K. Chandramouli] [4th October 1955

ఆ inamdars కు కుడివరము హక్కులేదు, మేలువరము హక్కుమాత్రమువున్నది. ఆ మేలువరము హక్కుతో వారు వసూలు చేసుకున్నదానిలో, quit rent, jodi మొదలైనవిపోను, మిగిలింది వారు service చేసినదానికి వుపయోగించుకుంటారు. అందువల్ల అటువంటి యినాములమీద అదనపుశిస్తులేకుండా చేశాము. లేకపోతే సర్వీసు చేసినదానికి వారికి డబ్బుయివ్వము గదా! అంతేకాని రంగనాథమొదలియార్ గారు చెప్పిన personal inams విషయమై వారు clear గా చెప్పలేకపోయినారు. అందువల్ల ఎప్పటికైన అటువంటి చట్టము వచ్చినప్పుడు యిటువంటి hardships ఏవో కొన్నిఉంటే వుండవచ్చు. అంతగా, అవివస్తే అప్పుడు వాటి విషయము ఆలోచించవచ్చును. అంతేకాని ప్రతి చిన్నవిషయమునుకూడా చేయాలంటే, అని సాధ్యపడదు. మరల ఏదైనా చేయాలంటే, అప్పుడు యీ House ముందుకు రావచ్చును. అయితే రంగనాథ మొదలియార్ గారు చెప్పినవిషయాలు ప్రభుత్వంవారి ఆలోచనలోనే వున్నది. కాబట్టి అటువంటి విషయములు యేవైన వస్తే, అప్పుడు వాటినిగురించి ఏదైనా చెయ్యటానికి ఆలోచించవచ్చును.

SRI S. RANGANATHA MUDALIAR :—My submission is, this is a small matter from the point of view of Government. But there are several inamdars who will suffer by the levy of full assessment. For example, an inamdar who gets a melvaram of only, say, Rs. 10, if he is asked to pay the entire ten rupees by way of full assessment, there will be nothing left for him after payment of assessment.

MR. SPEAKER : What the Government say is, they are exempted.

SRI S. RANGANATHA MUDALIAR :—The Inams, I am referring to are not service inams ; they are personal inams.

THE HON. SRI K. VENKATA RAO :—Sir, it is a well-known fact that the settlement done in this province was not on a uniform line ; the five palayams of Venkatagiri were settled on feudal tenure ; the incidence of taxation and the mode of settlement of course impinge upon a general law ; but in the Zamindari Abolition Act we have tried our best to cover all these estates also ; the question was examined in detail then. Mr. Ramakrishna Raju brought to the

notice of the Government the nature of certain personal inams in Karvettinagar area. Because, in those cases, the question of kudivaram does not arise ; melvaram was assigned for all inams that were included in 1802. This is a point we will examine when the question of right on land is determined by legislation. Till then, on the simple question of assessing revenue over these things we have followed a clear line. Except in the case of those service inams which are owned by persons mentioned in the third proviso, the rest will have to pay the taxes. If there is any difficulty.........as you have pointed out, Sir, where the jodi collected is less than the new assessment that is to be imposed, under clause 9, which Mr. Sundarayya just now discussed, we will take action and prevent any kind of particular hardship on particular sections of people.

SRI S. RANGANATHA MUDALIAR :—Will it not be better to legislate here on a matter like this ?

THE HON. SRI K. VENKATA RAO :—The right itself is not legislated upon. So how do you want it to be legislated in an issue where there is only an imposition of assessment.

SRI S. RANGANATHA MUDALIAR :—But why should there be a distinction made between inams and.........

THE HON. SRI K. VENKATA RAO :—Because the British Government in 1802 did not know that there is something called a palayam, and they settled the estates in two different lines, one, the feudal tenure of England (which is not germane to India), and the other is the permanent settlement adumbrated by Lord Cornwallis. That legal point, we need not seek to legislate in an assessment bill, which is only a sideway measure.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ప్లానింగ మంత్రిగారు మాట్లాడుతూ, incumbent అనే పదం ఎక్కడా వుండకూడదని, అది అసలు పద్ధతి కాదని చెప్పారు. అది అసలు ఈ బిల్లుకు సంబంధించినది కాదు కాబట్టి అది [illegible]

Sri S. Vemayya] [4th October 1955

కూడా కాదుఅని చెప్పారు. Board Standing Order లో artisan ఈనా ములక్రింద working incompetent అని చాలాచోట్ల వచ్చింది. అంతేకాకుండా ఇప్పుడు నేను తీసుకువచ్చినటువంటి సవరణలోకూడా ఈ resumption ను గవర్న మెంటు మరల తీసుకోవాలనే విషయాన్ని గురించిన్నీ యింకా కొన్ని విషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకురావలసి ఉన్నది. ఇప్పుడు resume చేసేటటువంటి 5 వ సెక్ష నులో ప్రభుత్వము యిప్పుడు ఇనాంవార్ల తరఫున సర్వీసు చేయకపోయినా తరువాత చేసినది అనే విషయాన్ని తీసుకున్నప్పుడు అతను అమ్మితే ఇతరులకుపోతుంది. అమ్మిన తరువాత ప్రభుత్వమువారు దానికి వెంటనే రైత్వారీరేట్లు వేస్తున్నారు. గాని, అంత వరకు వేయడములేదు. ఎందువల్ల వేయడములేదంటే అవి రైత్వారీగా resume చేసిన తరువాత రైత్వారీరేట్లు కట్టడానికి వీలున్నది కాని, ఈనాందార్ల చేతులలో 20 సంవత్సరములుగా భూములు లేవనేసంగతి నాకు తెలిసినది. వారిచేతులనుండి ఎవరో ఒకరు కొన్నారు. కొన్నవారు ఈనాంరేట్లే కట్టుతున్నారు. కాని రైత్వారీరేట్లు వారిమీద పడడములేదు. ఎందువల్ల పడటములేదు అంటే ఇది వాళ్లకు resume చేసి రైత్వారీరేట్లు వాళ్లమీద వేయడనులేదు. వేయకపోయి నందువల్ల నష్టము ఏమిటంటే ఈనాందార్లు సర్వీలుచేయనివి. మామూలుగా బోర్డు standing అర్డరు ప్రకారం గవర్నమెంటు resume చేసి ఎవరుఅయితే పనిచేస్తుం టారో, ఆసర్వీసు చేసేవాళ్లకు beris deduction య్యివడము అనేది ఒకటిఉన్నది. కాని సర్వీసుచేసేవాళ్లు చేస్తున్నారు కాని భూములు వాళ్లచేతుల్లో లేకపోతున్నాయి. నేను తీసుకొచ్చిన సవరణలోకూడా వెంటనే ఈ భూములు అన్నీకూడా resume చేసేటటువంటి procedure అవలంబిస్తే అది సంవత్సరముల పర్యంతము పడుతుంది. కాబట్టి వాళ్లచేతుల్లో వున్నటువంటి భూములు వాటన్నింటికికూడా ఇవి అనువర్తించి నట్లయితే వెంటనే resume చేయాలి.

THE HON. Sri K. VENKATA RAO :—Last page లో last proviso లో చూడండి.

SRI S. VEMAYYA :—అందువల్ల యింకొక విషయముకూడా ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. ఈనాందార్లు సర్వీసుచేసి వాళ్లు వుండాలన్నప్పుడు ఈ భూము లన్నీకూడా ఇతరుల eliminate చేసుకున్నా అమ్మినా board standing order లో వున్నది. Alienate చేసినాకూడా అది resume చేయడానికి వీల్లేదు అన్నారు. ఆ విధంగా వున్నప్పుడు ప్రస్తుతం వున్నటు వంటి order ప్రకారము ఈమధ్య నాకు తెలిసినంతవరకు ఎవరైన eliminate

[illegible]

కూడా చెల్లుతుంది. కాని resume చేసి రైత్వారీ కేట్లు వేయవచ్చును. అందువల్ల వచ్చేడబ్బు మాత్రము being deduction క్రింద అక్కడ సర్వీసు చేసేవాళ్లకు ఇవ్వవచ్చును అన్నారు. అనేక చోట్లకూడా ఈనాందార్ల చేతుల్లో భూములు అన్ని లేవు. ఇవన్నీ కూడా ఇతరులచేతుల్లో వున్నాయి. అందువల్ల అది వెంటనే resumption అయినా, కాకపోయినా ఇవి అమల్లోకివచ్చి సర్వీసు చేసేవాళ్లకు basis మినహాయించినట్లయితే కొంత బాగుంటుందనిచెప్పి నేను మనవి చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI B. SANKARAIAH :— అధ్యక్షా, అసలు ఎప్పుడో 1947 లో Inam abolition అనేది వచ్చినప్పుడు ఈనాంలపైన రైత్వారీ కేట్లు వేయాలని చెప్పి వున్నది. ఇటువంటప్పుడు ఏది మైనరుఈనాము, ఏది మేజరుఈనాము అనేదే ఇప్పుడు ఆంధ్రదేశంలో పెద్ద తగాదా అయిన సమస్య. వేలకొలది కేసులు యిప్పటికి కోర్టులకు ఎక్కివున్నవి. దీనిమీద లక్షలమంది రైతులకు interest వున్నది. అందువల్ల 6 లక్షలమంది ఇప్పటికే ఈనాము రైతులుగా వున్నారు తక్కినవాళ్లు యింకా కనీసం కొన్నిలక్షలమంది అసలు ఎక్కడచూచినా వాళ్లు ఈనాంరైతులుకాదని చెప్పినప్పటికి ప్రభుత్వము తేల్చకుండా ఉన్నది. అందువల్ల రోజురోజుకూ పొలాలనుంచి వెళ్లగొరుతున్నారనే రిపోర్టులు వస్తున్నాయి. ఇటువంటప్పుడు మైనరుఈనాములు అని చెప్పి ఇందులో estate abolition క్రిందకు రానటువంటివి అన్నీకూడా రైత్వారీ గ్రామాలలో వున్నటువంటి వన్నిటిమీదకూడా ఈ శిస్తును విధిస్తున్నారు. కాని ఈబిల్లు పెట్టినంతమాత్రాన ఎక్కడకూడా ఈనాము రైతులకు నష్టము కలుగచేయమన్నారు. కాని ఇంతవరకు గ్రామాలలో వున్నటువంటి వస్తువులు ఏమిటి, అసలు ఇది ఈనాముభూమి అని తెలిసే దానికి ముందు దానికి ఏదో తక్కువశిస్తు వుండటము అనేది ఇప్పుడు గ్రామాలలో ఇది ఈనాముభూమి అని, తక్కినది రైత్వారీభూమి అని ఇప్పుడు ప్రత్యేకత ఒకటి ఉన్నది. కాని ఈబిల్లువల్ల ప్రత్యేకత తీసివేసిన తరువాత ఇప్పటికి ఈనాందారులు చాలాచోట్ల ఏదో సాకుచూపించి రైతులను తొలగించడము అనేది వున్నది. ఉదాహరణకు మా నియోజకవర్గంలో పడుగుపాడు అనే గ్రామము ఉన్నది. అక్కడ 100 కి 90 గ్రామాలు ఇప్పుడు రైత్వారీ గ్రామాలుగానేవున్నవి. కాని వున్నటువంటి 10 గ్రామాలుకూడా ఇప్పుడు ఈనాము గ్రామముక్రింద ఇచ్చివేసినారు. ఈనాందార్ల క్రింద రైతులు సాగుచేసుకొంటున్నారు. ఇటువంటివి ఏవో చిన్నచిన్న సాకులు వచ్చినప్పుడు కొంత కొంత మందిని

వెళ్ళగొడుతున్నారు. ఇప్పుడు దానివల్ల ఇటువంటిసారు జరగడానికి అవకాశము వున్నది. ఎక్కడెక్కడయితే రైత్వారీ భూములకు ప్రక్కనవున్న మాగాణీభూమికి తక్కువశిస్తు ఉంటుందో వాటికి మినహాయించి తక్కిన వాటికి తీసుకురావచ్చు. కాని ఇంకా కొన్నిలక్షల రూపాయలు గవర్నమెంటుకు నష్టముకూడా వస్తుంది. ఎందువల్లనంటే ఇదివరకు ఇరిగేషను facilities వున్న చోట మళ్లీ ఇరిగేషను facilities ఇచ్చిన తరువాత ఇటువంటివాటి ప్రక్కమాగాణికి పడే water rate గాని assessment గాని వేయకుండా వుండేటటు వంటి లక్షలకొలది ఎకరాలు మనరాష్ట్రములో వున్నాయి. గవర్నమెంటుకు 60, 70 లక్షల శిస్తుకూడా వస్తుందని లెక్కలుకూడా వేశారు. ఇటువంటివాటికి తీసుకురాకుండా ఇప్పుడు ఈ మైనరు ఈనాములని ఒకటి తీసుకువచ్చారు. ఇప్పుడుఅయినా ముఖ్యముగా కోరేది యేమిటంటే మరొక పర్యాయము ప్రభుతం ఈ శిస్తును విధించినందువల్ల ఈనాం రైతులకు పోదు అని మళ్లీ ఒక్క పర్యాయము తెలియచేయాలని, త్వరలోనే Inams Abolition Act తీసుకొనివచ్చి ఇంకా యితర రైతులమీదకూడా ఈసారు చూపించి వాళ్లు మళ్ళీ ఈ మైనరు ఈనాములకు ఎక్కడకూడా ఆచరణలో ఎటువంటి ఇబ్బందులు రాకుండా ఎటువంటి నష్టము రాకుండాకూడా చూడాలి. త్వరలో Abolition Act తీసుకు వచ్చి ఆ సమస్యను వెంటనే పరిష్కరిస్తారని కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :— దీని విషయమై యింకా నేను చెప్పేది ఏమీ లేదు. సెలక్టు కమిటీవారు అంతా కూడా బాగా ఆలోచించి వారి రిపోర్టును సభముందు పెట్టారు. తరువాత శాసన సభలో వున్నటు వంటి సభ్యులంతాకూడా చాలా ఆమూలాగ్రంగా విమర్శనలుచేసి తేలిగ్గా pass చేయడానికి తోడ్పడినందుకు వారందరికికూడా నా నమస్కారములు.

MR. SPEAKER : The question is—

That the Andhra Inams (Assesment, Bill, 1955 be passed into law.

The motion was carried and the Bill was passed into law.

The House adjourned for lunch.

AFTER LUNCH 2-30 P. M.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—By way of information, Sir. ఈవేళతో సమావేశం ముగుస్తుంది అనుకుంటాను. తిరిగి ఎప్పుడు సమావేశమవుతామో తెలియదు. ఫజుల్ అలీ కమిషన్ రిపోర్టు రాష్ట్రాలకు పంపుతారని పత్రికలలో చదివాము. దానిమీద శాసనసభ చర్చ ఎప్పుడు జరుగుతుందో లేక ఆ విషయములో ఎవరెవరిని సంప్రదింప తలచుచున్నారో చెబుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Official గా ఆ రిపోర్టు publish చేసేవరకు discuss చేయడం బాగుండదు. Government of India వారు publish చేసినతరువాత సాధ్యమైనంత త్వరలో ఈ శాసనసభ సమావేశాలలో తమ అభిప్రాయాలను చెప్పవచ్చును.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—రిపోర్టు అందిన తరువాత కొందరిని కలిసి మాట్లాడాలనే అభిప్రాయం ఉన్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—గవర్న మెంటు అభిప్రాయం చెప్పాలని కోరుతారో, లేక శాసనసభ అభిప్రాయం చెప్పాలని కోరుతారో తెలియదు. వారు indicate చేయవచ్చు. ఏదీ తెలియకుండా ఏమీ చెప్పలేము.

## MESSAGE FROM THE GOVERNOR.

MR. SPEAKER : I have to announce to the House that the following message dated the 29th September, 1955 has been received from the Governor of Andhra :—

"In pursuance of Article 207 (1) of the Constitution of India, I, Chandulal Madhavlal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to move in the Andhra Legislative Assembly the amendment shown in the Annexure, to item (viii) in clause 2 (ii) of the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) Andhra Amendment, Bill, 1955.

### ANNEXTURE.

*Clause* 2 (*ii*)

In item (viii) relating to tax on raw tobacco, *for* the words 'At the rate of six pies for every rupee on his turnover"

*substitute* the words "At the rate of seven and a half pies for every on his turnover."

## III. THE MADRAS GENERAL SALES TAX AND THE MADRAS TOBACCO (TAXATION OF SALES AND REGISTRATION) (ANDHRA AMENDMENT) BILL, 1955, (L A. BILL NO. 15 of 1955) AS AMENDED BY THE SELECT COMMITTEE.

THE HON. SRI D. SANJIVAYYA : Sir, I beg to move—
That* the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) Andhra Amendment Bill, 1955 as reported by the Select Committee be taken into consideration."

అధ్యక్షా, ఈ బిల్లును ప్రతిపాదిస్తూ అందుకు కారణాలు ఒకటి, రెండు మనవిచేస్తాను. ఆంధ్రరాష్ట్రంలో మన వ్యవహారాలు మనం నడుపుకుంటున్నాము. మనరాష్ట్ర ఆదాయవ్యయాలు అందరికి తెలుసును. ఆదాయానికి మించిన వ్యయం చేస్తున్నాము. అభివృద్ధి కార్యక్రమాల నెన్నో తలపెట్టుకుంటున్నాము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అనేకకోట్ల రూపాయల విలువగలిగిన పథకాలను తయారు చేసుకుంటున్నాము. వీటిని సాధించాలనే సత్యసంకల్పంతో పనిచేస్తున్నాము. మన ఆదాయాన్ని అభివృద్ధిచేసుకోడానికి ఈబిల్లు తీసుకురావలసి వచ్చింది. ఇంతకుపూర్వమే ఎక్కువ ఖరీదుగల సిగరెట్లమీద చుట్టలమీద పన్ను వేశారు. ఆనాడు మూడుపైసలకంటె తక్కువఖరీదుగల సిగరెట్లమీద పన్ను వేయలేదు. వీటిమీద కూడా పన్ను యిప్పుడు వేయాలని ఇందులో ప్రతిపాదిస్తున్నాము. రెండణాలులోపువుండే cigars మీద (చుట్టలమీద) పన్ను వేయలేదు. ఇప్పుడు వీటిమీద కూడాపన్ను వేయాలని సంకల్పించినాము. బీడీలు, snuff, chewing tobacco మొదలైన వాటిమీదకూడా పన్నువేయాలని ప్రతిపాదిస్తున్నాము. పొగాకు వుత్పత్తిదారు మొదట అమ్మినపుడు purchase tax అమ్మినవాడు కాకుండా కొన్నవాడు చెల్లించేట్లా వేస్తున్నాము. బీడీలు, chewing tobacco, snuff చాలా బీదవాళ్లు తక్కువ ఆదాయం కలవాళ్లు ఉపయోగిస్తారు. కాబట్టి వీటిమీద పన్నువేస్తే ధర పెరిగితే చాలాకష్టంగా వుంటుందని కొందరు సందేహాలు వెలిబుచ్చారు. మద్రాసులో యిటువంటిపన్ను విధించారు. మద్రాసులో ఉత్పత్తిఅయే తాజ్‌మహల్ బీడీలు, చోటాకరింబీడీలు ఆంధ్రదేశంలో ఉపయోగిస్తున్నారు. వాటిఖరీదు ఏమీ పెరుగలేదు. ఇవి వినియోగించేవారికి యేమీ బాధవుండదని మనవిచేస్తున్నాను. ఇటువంటి tax హైదరాబాదు రాష్ట్రంలో కూడా వున్నది.

---

*Vide appendix at pages infra.

అంతేకాకుండా బీడీలను ఉత్పత్తి చేయడానికి ఉపయోగించే పొగాకులు అంటారు. ఆ ఆకుమీదకూడా పన్నుఉంది. మద్రాసులోను హైదరాబాదులోను country tobacco మీద Purchase Tax మీద Sales Tax ఉంది. Select Committee లో country tobacco మీద Sales Tax మినహాయింపు చేశాము. కేవలము Virginia tobacco మీద, సిగరెట్లు తయారుచేసే సున్నితమైన పొగాకుమీద ఈ Purchase Tax వేస్తున్నాము. నాటుపొగాకు మొత్తం ఉత్పత్తిలో 100 కి 50 వంతులుపైనా ఉంటుంది. ఈ Tax వేసే ఇటువంటి పోకర్యాన్ని Select Committee వారు ఈబిల్లులో ఏర్పాటుచేసినారు. ఇది ఎట్టి బాధకరము కాదు. అధికవ్యయానికి గురిచెయ్యదు అనేభావము వెల్లడిస్తున్నాను. ఆ నమ్మకము నాకుఉన్నది. అందువల్ల విశేషముగా చర్చలేకుండా సెలక్టు కమిటీవారు ఏకగ్రీవముగా ఆమోదించిన, సవరణలతో బిల్లును సభవారు ఆమోదించవలెనని కోరుచున్నాను. మిత్రుల వెంకటేశ్వర్లుగారు, నాగిరెడ్డిగారు సెలక్టు కమిటీలో ఉన్నారు. 1, 2 సవరణలు ప్రతిపాదిస్తాము, అవికూడా సభవారు అంగీకరించవలెనని కోరుచున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇది Sales tax మార్పుచెయ్యడంకాని, Purchase tax వెయ్యడంకాదు. అందువల్ల Purchase tax వెయ్యడానికి యీ బిల్లును తీసుకువచ్చారంటున్నాను. Sales tax కు సంబంధించిన Act లో Purchase tax తీసుకొని రావడం double గా ఉంది. కాబట్టి నేను దీనికి అభ్యంతరం తెలుపుతున్నాను.

THE HON. Sri B. GOPALA REDDI :—1939 లో దీని విషయమై చర్చజరిగింది. Sale అంటే Purchase అనికూడా అన్నారు. Vendor vendee అనిఉంది. కొన్నింటిమీద Purchase tax వేసినారు. వేరుశనగమీద Purchase tax ఉంది. ఈనాడు Sale అంటే Purchase అనికూడా ఆక్టులో ఉంది. Point of order దానిలో ఏమీలేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Parliament లో Budget discussion లో కూడా Deshmukh గారు మేము Purchase tax విడిగా తెస్తామని చెప్పారు. ఇది సమన్వయంచెయ్యడం ఇది out of order ఎలాకు అని అడుగుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—Sales Tax Act లో Sale అంటే definition చూస్తే సందేహం నివారణ అవుతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, మంత్రి గారు సెలెక్టు కమిటీ report ప్రవేశ పెట్టాలి.

MR. SPEAKER : Motion moved—

"That the Madras General Sales Tax and the Madras Tobocco (taxation of Sales and Registration) Andhra Amendment, Bill, 1955 as reported by the Select Committee be taken into consideration."

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, సెలెక్టు కమిటీలో ఈ బిల్లును గురించి తీవ్రముగా చర్చలు జరిగినవి. అసలు సెలెక్టు కమిటీకి పంపవలెను అన్నప్పుడు ముఖ్యముగా బీడీలు, తక్కువ రకము సిగరెట్లమీద పన్ను లేకుండా చెయ్యాలని మా ఉద్దేశము. ఎట్టకేలకు మంత్రిగారు నాటు పొగాకు మీద పన్ను తీసివేసి Virginia మీద 1½ దమ్మిడీలు పెంచడానికి అంగీకరించారు. అక్కడకూడా చెప్పాము. ఇది సాధ్యమైనంతవరకు రైతులమీద పడకుండా చూడాలని వ్యాపారస్థులమీద పడేటట్లు చూడాలని అన్నాము. అయితే చట్టాలు త్యాగము మనవారికి అడ్డుపడుతున్నాయి. కాబట్టి రూల్సుద్వారా నైనాసరే ఈ పన్ను రైతులవద్దనుండి కాకుండా I.L.T.D. లాంటి పెద్ద వ్యాపారస్థుల మీద ఈపన్ను పడేటట్లు చూడవలెను. అట్లుచేస్తే సంతోషిస్తాము. I. L. T. D. వారివద్ద పన్నులు ఎక్కువవసూలుచేసినా మాకు అభ్యంతరములేదు. ఏ మంత్రి వర్గాన్ని అభినందించనంతగా ఈ మంత్రివర్గాన్ని అభినందించుతాము. దీనిని రైతుల మీద పడకుండా చూడవలసిన అవసరముఉంది. ఇప్పటికే Tobacco మీద ఎక్కువపన్నులు వసూలుచేస్తున్నారు. సుందరయ్యగారు ఆ లెక్కలుఅన్ని ఇస్తారు. బీడీల విషయముమాత్రము ఒక విషయము చెప్పాలి. బీడీలమీద కొనిలోపు సిగరట్ల మీద అమ్మకము పన్నువేసినా వాటిధర పెరగకుండా చూస్తానని మంత్రిగారు సెలక్టు కమిటీ చర్చల సందర్భములో హామీఇచ్చారు. అది అమలు జరగడానికి కృషిచెయ్యవలెను. ఈనాడుఉంటే 0-0-3 రేటు ఏ పరిస్థితులలోకూడా పెరగ కుండా చూస్తామని, పెరిగితే తగినపద్ధతులలో వ్యవహరిస్తానని సంజీవయ్యగారు హామీఇచ్చారు. ఆ హామీని మన ఆర్థికమంత్రిగారు పాటించాలి. సెలెక్టు కమిటీకు చేసినవి. Assurances కావు, Ministers. Prestige is involved. ఆ విశ్వాసంతో మేము dissent minute ఇయ్యలేదు. 0-0-3 లోపు సిగిరెట్లమీద పన్నుకు మేము అంగీకరించలేదు. వార్షిహామీ మంత్రివర్గం అమల్లు పరచు

తుందని ఊరుకున్నాము. Taxation Enquiry Committee report లో ముక్కుపొడి పొగాకు, నమిలే పొగాకు include చేశారు. మద్రాసు రాష్ట్రములో ఆ list ఉంది. మనవారు కాఫీకొట్టు అన్నీ include చేశారు. మద్రాసు రాష్ట్రములో ఆ list ఉంది. మనవారు కాఫీకొట్లుఅన్నీ include చేశారు. అందువల్ల చిన్న చిన్న మార్పులు చేయవలసివచ్చింది. తక్కువ రకము, సిగరెట్లమీద, బీడీలమీద, నమిలేపొగాకుమీద ఈ పన్ను పడకుండా చూడకలిగాము. Virginia మీద పనూలుఅయ్యే Tax రైతులమీద పడకుండా చెయ్యగలంఅనే ధైర్యంఉంది.

SRI T. V. RAGHAVULU :—Point of information రాజ గోపాలాచారిగారు సేల్సుటాక్సు ప్రవేశపెట్టినప్పుడు chewing tobacco, నస్యం, తంబాకును exempt చేశారు. గాని ఇప్పుడు వాటిమీద వేస్తున్నారు. సాధారణ ముగా ప్రాథమిక అవసరాలమీద, పేదప్రజలువాడే వస్తువులమీద ఈ సేల్సుటాక్సు ఉండరాదన్న సూత్రానికి ప్రస్తుతము తెస్తున్నబిల్లు వ్యతిరేకముగా ఉన్నదని నేను మనవి చేస్తున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :—రాజగోపాలాచారిగారు బిలు పెట్టినప్పుడు 0-12-0. 0-15-0 సిగరెట్లమీద పన్ను వెయ్యలేదు. 1938-39 లో చేసినవి. అలాగనే ఉండదు. దేశము పురోభివృద్ధికావలెను. ఆర్థికఅభివృద్ధిలేనిదే దేశాభివృద్ధి ఎలాగ సాధించగలము?

SRI S. RANGANATHA MUDALIAR : Sir, I find a verbal difference in regard to items (vii) and (viii) in clause 2. In item (vii) the words used are 'at the point of the first sale' and in item (viii) 'at the point of the first purchase.' Is there any difference intended or is it only a distinction without difference.

THE HON. SRI D. SANJIVAYYA : That has to be paid by the purchaser, whereas in the other case, it is by the seller.

SRI S. RANGANATHA MUDALIAR : In that case, will not the producer be affected?

THE HON. SRI D. SANJIVAYYA : The producer will not pay, but it is only the purchaser. The dealer in tobacco will have to purchase tobacco from the producer and the dealer

will have to pay what is known as purchase-tax to the Government. It is not the agriculturist that pays.

THE HON. SRI B. GOPALA REDDI : And ultimately by the consumer.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా! ఈ Select Committee లో నేనుకూడా ఒక సభ్యుడను. కొన్నిటిమీద చాలాసేపు చర్చలు జరిగిన తరువాత ఒక నిర్ణయానికి రావడం జరిగింది. ఐతే ఒక విషయం అక్కడ చర్చకు రాలేదు. గుర్తులేనందువల్లనైతేనేమి, ఇతర కారణంవల్లనైతేనేమి నేనుకూడా అది అక్కడ కమిటీ దృష్టికి తీసుకురాలేకపోయినాను. అది ఇప్పుడు మంత్రిగారి దృష్టికి తేవలసిన అవసరం ఉందని భావిస్తున్నాను. కాని ఖరీదు లోపు సిగరేట్లమీద, బీడీలమీద మన సరిహద్దులలో యున్నటువంటి ఇతర రాష్ట్రాలలో ముఖ్యంగా మదరాసు, హైదరాబాదు రాష్ట్రాలలో ఈ పన్నులు వేసినప్పటికీ ఇటు సిగరేట్ల ధరకాని అటు chewing tobacco ధరగాని పెరగలేదు, అనేటటువంటి విషయం మంత్రి సంజీవయ్యగారు తీసుకురావడం జరిగింది. అలాంటివి జరగడానికి ప్రభుత్వం గట్టిశ్రద్ధ తీసుకోవాలి అనేవిషయంకూడా అక్కడ వచ్చింది. ఐతే రెండోవైపున ఇంకో ప్రమాదంకూడా ఉంది అనేటటువంటిది ఇప్పుడు మేము అనుకుంటున్నాం. ఈ పడేటటువంటి అధికపన్ను అనేది తయారుచేసేటటువంటి పెద్ద పెద్ద వ్యాపారస్థులు, ఇప్పుడు చిల్లరగా వ్యాపారం అంటే, బీడీకొట్లు, కిళ్లీదుకాణాలు పెట్టుకున్న దుకాణదార్లమీద ఆధారపడినటువంటి పన్ను-చిల్లరగా గాని, లేదా Wholesale గా గాని, వీళ్ళకు అమ్మేటటువంటి ఈ బీడీదిండ్లమీద కానియ్యండి, సిగరెట్లదిండ్లమీద కానియ్యండి అది తగ్గించుకుని ఈ చిల్లర వ్యాపారస్థులమీద ఆ పన్నుభారం వేసేటటువంటి ప్రమాదం ఉన్నదనే విషయం నేను మళ్లీ ఆలోచించినప్పుడు జ్ఞప్తికి వచ్చింది. ఇదివరకు సిగరెట్టుదిండుకి అర్ధరూపాయో, అరణాలో చిల్లరకొట్టువారికిచ్చేటప్పుడు తక్కువ ఇస్తూఉండేవారు. ఇప్పుడు Charminar సిగరెట్టు ఉన్నదనుకోండి. దాన్ని packet అణన్నరచొప్పున చిల్లరగా అమ్మాలని జరుగతోంది. ఈ అణన్నరచొప్పున అతను అమ్మకొనేటట్లయితే దిండుఒక్కటికి పావులో, అరణాలో లాభంవచ్చేటట్లుగా ఇదివరకు wholesale వ్యాపారస్థులు జరుపుతూంటే, ఇప్పుడు పన్నుపడింది. కాబట్టి మళ్ళీ ఒకబేడో, మూడణాలో అతనికి వచ్చేటటువంటి లాభంలో దిగకోసి చిల్లరకొట్లకు ఇచ్చేటటువంటి ప్రమాదంకూడా ఉన్నది. ఇప్పుడు ప్రభుత్వంయొక్క బాధ్యత ఒకవైపున consumers మీద ధరలు పెరగకుండా చూడడమే కాకుండా, రెండోవైపున చిన్న చిన్న

shop లు పెట్టుకొని చిల్లరగా అమ్ముకొనే వ్యాపారస్థులకు ఇదివఱకు ఏవిధంగా ఐతే ఆ బీడీదిండ్లమీదకాని, సిగరెట్లుదిండ్లమీదకాని, లేదా నమిలేటటువంటి పుగాకుమీదగాని, చుట్టలదిండ్లు వీటిమీదగాని, ఏవిధంగా ఇదివఱకు percentage of profit ను ఇస్తున్నారో ఆవిధంగానే ఇప్పించేటట్లుగా ప్రభుత్వం తప్పని సరిగా చర్య తీసుకుంటారని అనుకుంటున్నాం. లేకపోయినట్లయితే రోజుకు రూపాయో రెండు రూపాయిలో సంపాదించుకుని తమ జీవితాన్ని గడుపుకొనేటటువంటి చిన్న చిన్న వ్యాపారస్థులకూ, కిల్లీ కొట్లవాళ్లకూ మనంవేయబోయేటటువంటి పన్నులన్నీ వాళ్ల మీదపడి వాళ్ళకువచ్చేలాభాలు పోతాయి. ప్రభుత్వం తగినటువంటి చర్యతీసుకోక పోయినట్లయితే మళ్ళీ ఇది consumers మీద, చిల్లరవ్యాపారస్థులమీద తప్పని సరిగా వేస్తారు. ఇప్పటికే అణన్నరచొప్పున Charminar అమ్మాలని, బేడా అర్ధణా బీడీకట్టలు అమ్మాలనిఉంటే, అవి ఆ చరణాలోకి వచ్చేటప్పటికి Char minar సిగరెట్లు అణామూకాన్ని చొప్పున ఎక్కడపట్టినా అమ్ముతున్నారు. ఆ విధంగానే బీడీదిండ్లుకూడా ఈ పెద్ద వ్యాపారస్థులూ, manufacturers ఈ Tax చిల్లరవ్యాపారస్థులమీద వేశారంటే ఇప్పటికే Black market Rate అణా మూకాన్ని అమ్ముతున్నటువంటి అణన్నర సిగరెట్టు Packet మళ్లీ బేడకు అమ్మే ప్రమాదంకూడాఉంది. అందుకని రేట్లుపెరగకుండా చూడడానికి, ఇదివఱకు ఈ Wholesale వ్యాపారస్థులు, Manufacturers చిల్లర వ్యాపారస్థులకు ఎట్లా అమ్ముతున్నారో ఆ లాభంవాళ్ళకి ఉండేటట్లుగా ప్రభుత్వం చూడాలని గట్టిచర్య తీసుకోవాలని మనవి చేస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ select committee లో పెద్దలంతా కూర్చొని చర్చజేశారు. ముఖ్యంగా వర్జీనియా పుగాకుమీద పన్ను వెయ్యాల వేటటువంటి నిర్ణయం అనేక వీలైనంత పెద్దమొత్తం కూడా వెయ్యడానికి నిర్ణయించినట్లు తెలుస్తున్నది. ఈ వర్జీనియాపుగాకు వస్తువులు ఇతరదేశాలకు పోయినప్పుడు వాటిమీద పన్నువెయ్యటానికి ఎవరికీ అభ్యంతరం వుండదు. రైతులమీద వేసేటట్లయితే, క్రిందటిసంవత్సరం, ఆ క్రిందటిసంవత్సరం ధరలుపడిపోయి, సరుకు అమ్ముడుకాక, ఆది ఇళ్ళలోపెట్టుకుని మట్టిపాలు చేసుకున్న పరిస్థితులలో, వారుకూడా ఇది భరించలేని పరిస్థితులలో ఉన్నారు. నేనింతదాకా అడిగిందికూడా అందుకే. Purchase Tax, Sales Tax రెండింటికీ అవకాశం ఉన్నప్పుడు, ఇది purchaser మాత్రం పెట్టుకుని రైతాంగానికి సంబంధం లేకుండా ఉండేటట్లయితే వెయ్యటానికి ఎవరికీ అభ్యంతరం ఉంటుందని నేననుకోను. నాకుకూడా అభ్యంతరంలేదు. క్రిందటిసంవత్సరం జరిగినటువంటి చరిత్ర పునరావృతం

Sri Vavilala Gopalakrishnayya] [4th October 1955

కాకుండా చూడాలి. మనసరుకు అమ్ముడుపోకపోతే మనం యితరదేశాలలో మార్కెట్లకోసం Commissions పంపించవలసి వచ్చింది. గోదావరి కృష్ణా గుంటూరు జిల్లాలలో ఇది ప్రధానసమస్యగా కూర్చుని పుగాకు release ఐతేగాని ఇళ్ళల్లోను మనుష్యులుకూడా ఉండటానికి వీలులేని పరిస్థితిలో ఉన్నప్పుడు కేంద్ర ప్రభుత్వంవద్దర ఆందోళన చెయ్యడం పాతపుగాకు పౌనుకు 0-1-6 తగ్గించి కొంత release కావడానికి ప్రయత్నంచేసింది. ఈ సంవత్సరం పంట తక్కువయినందు వల్ల దాదాపు అంతా release అయినది. ఇది luxury అనుభవంచేవారు వాడు తున్నారు గనుక వాళ్ళమీద వేయవద్దని నేను చెప్పను. కాని రైతాంగానికి మళ్లీ slump వస్తే కష్టమవుతుంది. ఈ పరిస్థితి యిదివరకూ కేంద్రప్రభుత్వం దగ్గరకు ఎన్నో deputations వెళ్లిన తరువాతనే వాళ్లపరిస్థితులు అర్థంచేసుకున్నారు. వారు పాతదిమాత్రమే తగ్గిస్తామన్నారు. ఎప్పుడైతే అమ్మకం జరిగిందో మేము ఎవ్వరముకూడా పోయి తగ్గించమని అడగలేదు. మంత్రిగారు చెప్పేటప్పుడు ఇది నేసే వాళ్లు చాలా పెద్దవాళ్లు. వాళ్లమీద వేస్తున్నాం అంటారు. వాళ్లమీద tax వెయ్యడానికి నేనెప్పుడూ వ్యతిరేకిని కాను. కాని సరుకు అమ్మకం కానప్పుడు వారిమీద వెయ్యకుండా purchase చేసే సాహుకార్లమీద వేస్తే ఎవరికీ అభ్యంతరం లేదు. ఈ విషయంమాత్రం మీదృష్టికి తీసుకువస్తున్నాను.

3—p. m.

Sri M. NAGESWARA RAO :—అధ్యక్షా, ఈ sales tax మొట్ట మొదటిసారిగా ప్రవేశపెట్టినారు. అసలు భారతదేశంలోపండే యావత్తు వాణిజ్య పంటలలో పొగాకు అగ్రస్థానం వహించిన విషయం అందరకు తెలుసును. ముఖ్యంగా ఈ పొగాకుకు 1933 సంవత్సరంలో Special Act అనిచెప్పి ఒక విధమైనటువంటి tax వేయటానికి ప్రారంభం అయింది. అది 1936 వ సంవత్సరంలో బొంబాయి గవర్నమెంటువాండ్లు ఒక tax వేస్తామని చెప్పేటటువంటి proposals రాగానే, proposals వచ్చి ఆ tax నిర్ణయించడం జరిగింది. కాని మూడుసంవత్సరముల లోపల tax ను అమలుపరచకుండా వాండ్లంతట వాండ్లే మానుకొన్నారు. తరు వాత 1939 లో మళ్ళీ మద్రాసుప్రభుత్వం దీనిమీద tax వేయడానికి ప్రారంభించి tax వేసింది. ఆ Tax కూడా ఎట్లావేశారంటే, కొనుగోలుదారుడు అనేటటువంటి ఆయనేగాని, అమ్మకదారుడుగాని ఎవరు భరించాలనేది లేకుండా dealers రెండు రకాలుగా విభజించారు. (1) whole sale dealers అనిన్ని, (2) retail dealer అనిన్ని, whole sale dealer కి 2% turn over మీదను, retail dealer కు 1% turn over మీదనుకూడ tax విధించారు. అప్పుడు కొన్నిలక్షల

రూపాయలకు తక్కువగా సేవన్తూవుండేది. ఇంతలో 1943 వ సంవత్సరం 1st Aprilలో Central Government వారు ఈ పంటయొక్క అవసరాన్ని గుర్తించి పంటవల్ల వచ్చే ఆదాయాన్ని ఏరకంగా పెంచాలనేటటువంటి ఉద్దేశంమీద Central Excise వాండ్లు ఇదిఅంతాకూడా సమగ్రమైనటువంటి పరిశీలనచేసి యావత్ భారతదేశానికి వర్తించేటట్టుగా, ముడిపొగాకుమీద కాకుండా ఈ పొగాకు తయారై redrying plants లు అయినతరువాత, manufacture అయినతరువాత ఇతర దేశాలకు transport చేసేటప్పుడు పన్ను విధించడం జరిగింది. దానిమీదట కేంద్రప్రభుత్వానికి అప్పుడు దాదాపు 30 కోట్ల రూపాయల ఆదాయంరావడం తటస్థపడింది. ఇప్పుడు ముఖ్యమంత్రిగా ఆర్థికమంత్రిగా ఉన్నటువంటి గోపాల్ రెడ్డిగారు ఆనాడుకూడ ఆర్థికమంత్రిగా వున్నారు. వారే ఒకసారి Assembly లో చెప్పడం కూడ జరిగింది. అప్పుడు 1943 లో ఈ బిల్లువచ్చిన తర్వాత మనరాష్ట్రానికి ఎంతకోటా రావాలి అనేటటువంటి దానికోసం వీరు కృషిచేస్తే, అంతకు ముందుదాక కేంద్రప్రభుత్వంవాండ్లు 22 లక్షల రూపాయలు మాత్రమే మనకు కేటాయించారు. Bombay Govt. కు 20 లక్షలు, కేటాయించారు. పంటపండేకొద్ది రాష్ట్రాలలో కేటాయించిన తర్వాత ఒక 10 సం॥ ప్రభుత్వముతో పోట్లాడిన తర్వాత Bombay Government కు 55 లక్షలు అప్పుడు ఉమ్మడిరాష్ట్రముగవున్న మన మద్రాసుప్రభుత్వానికి 56 లక్షలును ఇచ్చేటట్లు చేశారు. చేసినతర్వాత అప్పుడు 1943 లో జరిగినటువంటి Act ద్వారా పొగాకు మీద సమగ్రమైన పరిశీలనతో Tax వేశారు.

కాబట్టి రెండో tax పొగాకుమీద వేయడానికి వీలులేదని కేంద్ర ప్రభుత్వం వారు ప్రదేశ ప్రభుత్వాలకు ఆదేశము ఇచ్చి వాండ్లను అరికట్టారు. ఆ agreement 1953 వ సంవత్సరంతోటి అంత్యమైంది. 1953 వ సంవత్సరం అంటే మన ఆంధ్ర రాష్ట్రము విడిపొయ్యే రోజులకు ముందు మద్రాసు ప్రభుత్వంలోను మన ప్రభుత్వం వారుకూడ నియమించారు. నియమించితే దానిమీద 16 లక్షలు 1953-54 లోనున్ను, 18 లక్షలు 1954-55 లోనున్ను, దాని ఆదాయం పెరిగింది. ఆదాయం ఎంత పెరిగినప్పటికికూడ అప్పటికికూడ cigarette tobacco మీద, pipe tobacco మీద, cigar tobacco మీదనే వేస్తూ, తతిమ్మా ఇతర చిన్న cottage industries కు పనికి వచ్చేటటువంటి వాటిని, సామాన్య ప్రజలకు పనికివచ్చేటటువంటి వాటిని అన్నిటికి కూడ వదలి పెట్టేశారు. అప్పటికి కూడా పొగాకు రూపంలో ఇంతవరకు ఈ పొగాకు tax అనేది ఎరుగదు. ఈ పరిస్థితులు అన్నికూడ మనస్సులో పెట్టుకొని మళ్లీ కేంద్ర ప్రభుత్వంవారు 1953 లో ఆagreement అయిపోయిన తర్వాత వాండ్లు యావత్ భారతదేశానికి అన్ని States కు కూడ, అప్పుడు రాజగోపాలాచారిగారు ఉన్నారు, పంట పండించేటటువంటి వాడికే

ఈ tax పోవడానికి వీలులేదు. ఎవరైతే దీనిని అనుభవించుతూ consumers గ ఉన్నారో వారందరికికూడ దీంట్లో వాట కావాలని చెప్పి మళ్ళీ కేంద్ర ప్రభుత్వం వారు ప్రతి ప్రభుత్వానికికూడ కొంత కేటాయించారు. ఆ కేటాయింపులో మన ఆంధ్ర రాష్ట్రానికి ఒక కోటి 8 లక్షలు రూపాయలు పొగాకు Cess వస్తుందని నాకు నమ్మకం. ఈ రకంగా పొగాకుమీద ఒక కోటి 8 లక్షలు, వీరు వేస్తున్నటువంటి 18 లక్షల రూపాయలు వస్తున్నాయి. ఇదిగాకుండా కూడ మునిసిపాలిటీలలో అనేక రకమైన పన్నులుకూడ పడుతున్నాయి. ఈనాడు ఆర్థికంగా అసలు రైతు ఏ రకమైన దెబ్బ తింటున్నాడు, దీనిమీద వచ్చేటటువంటి ఆదాయానికి ప్రభుత్వానికి ఎంత వస్తున్నది, రైతు ఎంత అనుభవిస్తున్నాడు అనేటటువంటి లెక్కలు తీసేటట్లుగా ఉంటే రైతుకు ఎకరానికి వంద రూపాయలుకూడ మిగులకుండా పోతున్నది. ఈనాడు దాదాపు 7 కోట్లు మొదలుకొని 10 కోట్ల రూపాయలవరకుకూడ భారతదేశం ఇతరదేశాలకు ఎగుమతి చేస్తున్నదంటే దాంట్లో రైతుకు ముట్టేది మాత్రం 4 కోట్ల రూపాయలు అని మాత్రం నేను మనవిచేయగలను. తరువాత redrying చేయడానికి manufacture చేయడానికి, మరి cigarette shape లో మారటానికి, మధ్య వర్తకులు నాలుగు stages మారేటప్పటికి, నలుగురి లాభాలు అన్నీ కూడచేర్చి వాటిమీద వేసుకుంటే, రైతుకు మనంమామూలుగా బజారులో average లెక్క చెప్పేదాంట్లో 50% అతనికి ముట్టుతుంది. ఆ 50% లోనే అతనికి కావలసినటువంటి ఖర్చులన్నిటిని భరించవలసినటువంటి అవసరం ఉన్నదనేది అందరికీ కూడ తెలిసినటువంటి విషయమే. అందువల్ల పొగాకు రైతుకు ఏవిధంగా ఇది effect అవుతూఉన్నది? పండించే వాడికి ఇది ఉన్నదాలేదా అనేటటువంటిది మాత్రం ఈనాడు ప్రధానమైనటువంటి ప్రశ్న. పొగాకు పండించేటటువంటి, direct purchase sales దీనికి చేస్తున్నాము కాబట్టి సాధ్యమైనంతవరకు ప్రతి రైతు పండించేటటువంటి పొగాకు, ఒక barren పుగాకు రైతు ఉన్నదంటే సాధ్యమైనంతవరకు average న 4,5 వేల రూపాయలకు దానిని అమ్ముతాడు. ఈ ఒక్క barren ఏడు ఎకరాలు మొదలుకొని, 10 ఎకరాలవరకు సరిపోతూఉంటుంది. అయిదు వేల రూపాయల ఆదాయంమీద రెండు వందల రూపాయలు tax కట్టవలెనంటే, purchase Tax ఎవరుకట్టుతున్నారో, కొనేటటువంటివారు కట్టుతున్నారు. వీళ్ళ కేమి కలుగదు అంటున్నారు. వ్యాపారస్థుడు మొట్టమొదటిసారి కొనపోయ్యేటప్పుడు చాల ఖరీదు కలిగినటువంటి వస్తువు కాబట్టి, 5 వందలు మొదలు 8 వందల వరకైనా కనీసం ఉంటుంది. అంటే 32 రూపాయలు మొదలుకొని 5 వందలకైతే 20 రూపాయలవరకు ఉంటుంది. కొనేటప్పుడే రైతు తాపత్రయంమీద ఉంటాడు అనేది అందరికి తెలిసినటువంటి విషయమే. కాబట్టి రైతు

4th October 1955] [Sri M. Nageswara Rao

దగ్గర మొట్టమొదట కొనేటటువంటి వ్యాపారస్థుడు తాను ఈ 20 రూపాయలో, 30 రూపాయలో తగ్గించేకొంటాడు. గాని ఇంకొక రకంగా కొనడు. అది అందరకు తెలిసిన విషయమే. Consumer కు పోతుందన్నారు. Consumer కు పోతుం దనేది చాల విచిత్రమైన స్వరూపంలో ఉన్నది. కేంద్ర ప్రభుత్వంవారు ఇదేమో మనకు మామూలుగా చెప్పతూ ఉంటారు. "పట్టేవాడు పట్టించుకుంటే, ఒడ్డున ఉన్నవాడు జల్ది అంటూ ఉంటాడట". ఆ రకంగానే కేంద్ర ప్రభుత్వం consumer మీద మేము వేస్తున్నాము, consumer దగ్గరనుంచే మేము తీసుకొంటు న్నాము, అంటారు. బీడీలు cigerette లు cosumers కదా తీసుకుంటూ ఉండేది, సిగరెట్లు, gold flake high class cigerrettes పైకూడా central excise వసూలు చేసే 40 కోట్ల రూపాయలు కూడ consumer దగ్గరనుంచే వస్తుందని చెప్పతున్నారు. ఇప్పుడు మనం ముడి పొగాకు మీద పన్ను వేస్తున్నాం. ఈ ముడి పొగాకు మూడు అవతారాలు దాల్చితేగాని manufacturer దగ్గరకు పోదు. ఈ మూడు అవతారాలు దాల్చినప్పటికీకూడ, కొన్నిరోజులుపోయిన తర్వాత రైతు కూడ తెలుసుకొన్న తర్వాత ఒక విధమైనటువంటి సదుపాయం కలిగి మామూలుగ అలవాటయిన తర్వాత తగ్గించక పోవచ్చునేమో గాని ప్రస్తుతం మాత్రం ఆ 20 రూపాయలో, 30 రూపాయలో ఈ tax రైతుకేగాని, purchasing చేసేవారికి కాకుండా పోతూ ఉంటుందని, అది వ్యాపారలక్షణం అని, వ్యాపారం తెలిసినవారం దరు ఒప్పుకుంటారు, గానీ మామూలుగ. ఈనాడు మనకు బొక్కసం తగ్గిపోయింది. 5½ కోట్ల రూపాయలు deficit అనేటటువంటిది ఒకటి కనబడుతుంది. కాబట్టి పన్ను వేయక తప్పదు. అనే దాంట్లో మాత్రం అది ఒప్పుకోవలసినటువంటి విషయమే. వ్యయానికి తగినటువంటి ఆదాయానికి తగినటువంటి వ్యయమే అన్నట్లయితే, మిగిలి పోతున్నదని ఒప్పుకోవాలి. ఈరకమైనటువంటి పరిస్థితులలో ఏవిధమైన tax మనం వేయాల? Immediate గ affect అయ్యేవాడు రైతాలేక వ్యాపారస్థుడా అనే ప్రశ్న తీసుకొంటే, immediate గ ఇద్దరు కాదు) కాని వెంటనే రైతుకు మాత్రం తగులుతూ ఉంటుంది. కాదని సంజీవయ్యగారు చెప్పతున్నారు. వారికి ఒక మనవిచేస్తున్నాను. గడచిన 5 సంవత్సరాలనుంచి రైతులు పండిస్తున్న పంటను ఒకసారి సమగ్రమైన పరిశీలనచేసి ఏ ఏ grade కు ఎకరానికి ఎంత వస్తున్నదో ఆరకంగానే ఈబిల్లుమకూడ ఒకసంవత్సరం అమలుపరచి, ఈ సంవత్సరం లోపల, పంటలు పోయినా, 4,5 సంవత్సరాల నుంచి వచ్చిన ధర ఈ సంవత్సరముగాని రైతుకు వచ్చేటట్లయితే, మీరు continue చేయండి. ఒక సంవత్సరంమీరు experiment చేసి దీనివల్ల మాకు లాభం వస్తుంది. రైతుకు ఏవిధమైనటువంటి నష్టం లేదు నేమాత్రైతు శ్రేయోభిలాషులం అనేటటువంటిది ఈ విరంతవ స్మరణను ఆ చంద్రార్కంగా

Sri M. Nageswara Rao] [4th October 1955

చేయవలెనను కొంటూ ఉంటే, మీరు ఒక సంవత్సరం పరీక్షచేసి, గడచిన 5 సంవత్సరముల లోపలకూడ, మీకు రైతులకు లస్తున్నటువంటి అదాయానికి ధరకి ఏ విధమైనటువంటి తేడా అట్టే మాకు కనబడడంలేదు. 4% వేస్తున్నారు. 1% or 2% లేడా మాకు వచ్చినప్పటికికూడ రైతులు ఒప్పుకుంటారు కాదు. ఇది advantageగ తీసుకొన్న రైతు 6 to 10% వరకుకూడా దీనిని exploit చేయడానికి అవకాశం ఉంటుంది. అందులో పొగాకు పండించేటటువంటి రైతులకు తెలిసిన కష్టాలు మరొకరికికూడ తెలియవు. అందులో పొగాకుకు డబ్బు వస్తుందంటే మన అందరికికూడ తెలుసును. మంత్రులు అందరుకూడా ముఖ్యంగా వస్తుంటారు. గుంటూరికి వచ్చేటప్పటి పాతిక కార్లు ఉంటాయి. ఆ పాతిక కార్లుకూడ అమ్మటానికి సిద్ధంగావున్న కార్లు, పాతిక కాదు, 30 కి కూడా నోటీసులు ఉంటూఉంటాయి. కాని ఆనాడు కార్లు వచ్చేటప్పటికి, గూడూరు Mica mines లో వస్తున్నట్లుగానే Tobacco లో కూడ వీరందరు Tobacco Kings. వాండ్లందరికి శాశ్వతమైన ఆదాయంవస్తున్నది. కార్లలో తిరుగుతున్నారు. కాబట్టి Tax వేస్తే పరవాలేదు, అనేటటువంటి నమ్మకంమీద నే Taxలు వేయకుండా మీరు ఒకసంవత్సరం కనీసం, experimental measure క్రింద తీసుకొని గడచినటువంటి 5 సంవత్సరాల లెక్కలుకూడ తీసుకుంటే, మీకందరికికూడ తెలిసినటువంటి విషయమే ఇది. Central ప్రభుత్వంవారు ఒక కోటిరూపాయలు Cess ఇవ్వడమే కాకుండా పొగాకుకు ముఖ్యంగా కొన్ని పరిశోధనాలయములుకూడ ప్రారంభించారు. రాజమండ్రిలో ఒకటి, గుంటూరులో ఒకటి ఉన్నది. Central Tobacco Marketting Committee అనేటటువంటిది దీనికి ప్రత్యేకమైన కృషి చేస్తున్నవి. ఇది మొట్టమొదట బిల్లు ప్రచురించేటప్పుడుకూడ పొగాకుమీద, ముడిపొగాకుమీద, చుట్ట, బీడి, సిగరెట్టుమీద అన్వయంతోటే, అది సంజీవయ్యగారి భావకవిత్వం కాబట్టి, అది ఏరకంగా పెట్టారేమోగాని బిల్లును మాత్రం చాలవరకు మభ్యపరచింది. మభ్యపరిచినా, పరచకపోయినా, మేము తెలుసుకున్నా, తప్పపరిస్థితులు ఏమీ కనబడడం లేదనుకోండి. అది వేరే విషయం. ఏమైనప్పటికీ, పొగాకు ముడిపొగాకు అనేటప్పటికి ఇది ఎవరిమీదకూడదు? ఏదో మామూలు Cottage industries అని చెప్పారనేటటువంటి ఉద్దేశంతోటేఉన్నది. అయినప్పటికి 40 లక్షల రూపాయలు దీనిమీద ఆదాయం కనబడుతూఉంటే. దానిని ప్రభుత్వంవారు ఒకరకంగా తీసుకొనవలసిన అవసరం ఉంది. ఆ 40 లక్షల రూపాయలనైనాసరే, ఒక 10 లక్షలరూపాయలతోటి ఈ Co-operative societies ని ఏమైనాసరే ఒకవిధంగా start చేసి, పొగాకువంటికి, పొగాకు పండించేటటువంటి రైతులకి ఫలసాయం రాబట్టేటట్లు, ఈ సంవత్సరం ఒక ప్రణాళికనువేసి, మీరు ఏదైనా వేస్తే

4th October 1955] [Sri M. Nageswara Rao

రైతు ఒకవిధంగా నష్టపడినప్పటికీ, 1, 2 సంవత్సరాలలో ఈ taxation వల్ల చాలనష్టకష్టాలు రైతుకు ఉన్నమాటమాత్రం అందరికి తెలిసినటువంటి విషయమే.

పండించేటువంటి రైతుకు ధర రాబట్టడానికి చేసేకృషి ఇతరులకు తెలియక పోవచ్చునేమోగాని రైతుగాఉన్న వారికి నాకుతెలుసు. 1945 లో నేనుM.L.A. గా రాకపూర్వము, ఎప్పుడుకూడ పొలముతో సంబంధమున్నటువంటివాణ్ణి, బాగా పంట పండించేవాణ్ణి, ఎక్కువధరలు తీసుకువచ్చేవాణ్ణి. దాంట్లో బాగా ఆర్జించినవారిలో ఒకణ్ణి. కాని ఈనాడు పరిస్థితివేరు.

THE HON. SRI B. GOPALA REDDI :—రోజులు మారాయి.

Sri M. NAGESWARA RAO :—అవును రోజులుమారాయి. ఇటువంటి పరిస్థితులలో సమగ్రమైన పరిశీలనచేసి ఒక సంవత్సరం experimental గా దీన్ని తీసుకొందాము. రైతుకు ధరపడేటట్లుఉంటే మళ్లీ దీనిమీద Tax తీసివేయడానికి ప్రభుత్వము ముందడుగువేయడం చాలా సమంజసంగా ఉంటుంది. ఆంధ్రదేశములో ఉన్నటువంటి పొగాకు పంటదారులు దీన్నిగురించి తీవ్రమైన ఆందోళన చేయడానికి చాలా ప్రయత్నంచేస్తున్నారు. 16 వ తారీఖున గుంటూరులో బహిరంగమైన meeting ఉన్నది. కనుక దీన్నంతా మీరు సమగ్రంగా పరిశీలనచేసి ఒక experimental measure గా చేయవలసిందని కోరుతున్నాను. రెండవది, ప్రభుత్వానికి ఆదాయము కావలసినటువంటి అవసరమెంతో కన్పిస్తున్నటువంటి పరిస్థితులలో మేము దీన్ని support చేయవలసియున్నది. కాబట్టి ఈ బిల్లును support చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri B. VENKATASIVAYYA :—అధ్యక్షా, ఈరోజు ప్రవేశపెట్ట బడిన పొగాకు వస్తువులమీద పన్నువిధించే ఈ బిల్లు విషయంలో, రైతాంగం దృష్ట్యా చూచినట్లయితే ఈ పన్ను తప్పకుండా రైతులమీద పడుతుందని అనుకోడానికి ఏమి సందేహంలేదు. Central Excise duty విషయం తీసుకొన్నప్పటికీ, ఇది ఉత్పత్తిదారుకు దగ్గరగా ఉన్నటువంటి కొమగోలు దారువద్ద కాకుండా, కొనుగోలు దారుకు దగ్గరగా ఉన్నటువంటి manufacturers దగ్గర manufacturing process లో factory దగ్గర వేస్తున్నారు. మన ఇండియా ప్రభుత్వమువారు నిర్మించినటువంటి Taxation Enquiry Committee వారుకూడ ఈ పొగాకు మొదలైనవాటికి సంబంధించిన Excise duties అన్నీకూడ కొంతవరకు విచారణ జరిపారు. ఈ పొగాకుకు Excise duty గాని, Local tax గాని మరి Sales

tax గాని ఇవన్నీ ఒకచోట ఒకరూపములో రావు. పొగాకు పండించినదగ్గరనుంచి ముక్కుపొడిదగ్గరకు వచ్చేటప్పటికి, 30, 40 సార్లు ఈ Taxes కట్టుకోవడం జరుగుతుంది. అది Consumer మీద కొన్నిసార్లు పడుతుంది. Producers మీద కొన్నిసార్లు పడుతుంది. Taxation Enquiry Committee లో ఈపొగాకు Excise duty ని గురించి కొన్ని విషయాలు మనవిచేశారు. పొగాకు విషయంలో State Government, Central Government కూడ చాలా హెచ్చుగా పన్నులు గడిస్తున్నాయని వారు వ్రాశారు. Virginia పొగాకుమీద పౌనుకు 7-8-0 రూపాయలనుంచి 1-0-0 వరకు Excise duty ఉన్నది. అంటే పుట్టి ఒకటికి 5, వందల రూపాయనుంచి 7½ రెట్లువరకు Excise duty ఉన్నదన్న మాట. కొనినాటుపొగాకు తడుపుకొని త్రాగాలంటే, పౌనుకు ఆరుఅణాలు కట్టవలసి యుంటుంది. అంటే పుట్టికి 187 రూపాయలు అవుతుంది. ఇది ఇట్లుండగా Central Excise duty rules ప్రకారం, రైతు తనవద్ద పొగాకును ఒక సంవత్సరంకంటే ఎక్కువకాలము ఉంచుకోవడానికి వీలులేదని ఉన్నది. అందువల్ల పొగాకు పండించే రైతు తనకుధర గిట్టినా, గిట్టకపోయినా, ఏదో విధంగా ఇచ్చివేయవలసి వస్తున్నది. క్రిందటి సంవత్సరం, అంటే, 1954 లో రైతులు తమవద్ద నిలువఉండే పొగాకును పుట్టి 50 రూపాయలు చొప్పునే గాదు. ఉచితంగా బాడుగలుగూడ పెట్టి వ్యాపారస్థులకు తోలిపెట్టారు. ఈ విధంగా ఇచ్చినటువంటి సందర్భాలు గుంటూరులో ఎన్నో ఉన్నాయి. ఇది Excise Duty relief ఇవ్వకముందు, ఒక నెలక్రిందట జరిగింది. ఇటువంటి విషాదఘట్టాలు ఎన్నోఉన్నాయి, అందుచేత పొగాకురైతు ఏదో ఎక్కువ ఖండిస్తున్నాడు. పుట్టి 7 వందలు, 8 వందలు అమ్ముతున్నాడు. అందువల్ల అతను వందో, 50 రూపాయలో పన్నువేస్తే ఇబ్బందిలేదు అని అనుకోవడం చాలా పొరపాటు. మనకు వచ్చేటటువంటి లెక్కలనుబట్టిచూస్తే, ఒకటవనంబరు పొగాకు పుట్టి 8 వందలు, అని జనవరిలో అనుకొన్నది. మే జూన్ నెలలు వచ్చేటప్పటికి, అదేపొగాకునే 5 వ నంబరో, 6 వ నంబరో అనిచెప్పి, పుట్టి 50 రూపాయలకు, వంద రూపాయలకుకూడ తిరస్కరించి వెనుకకునెట్టివేసిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఇప్పటికైనా మీరు 0-1-0 వారికి పంపించి, కనుగొన్నట్లయితే జనవరిలో ఏవిధంగా ఉండినవో sales మరల మే లో ఏవిధంగా ఉన్నాయో, ఈ పొగాకువిషయంలో monopoly చేస్తున్నటువంటి floating companies ఏ విధంగా మోసం చేస్తున్నాయో అర్థమవుతుంది. ఈ విషయంలో రైతులకు ఎన్నో సాధకబాధకాలు వున్నాయని రైతులతరఫున చెప్పుచున్నాను. కనుక ఈ విషయంలో ex-branch పోలీసువారితో పరిశీలనచేయించి వారి రిపోర్టు తెప్పించుకోవలసిన అవసరము ఎంతయినా

ఉన్నది. ఈ I. L. T. D. కంపెనీవారు ఈ పొగాకు మార్కెట్టును ఎంత తారు మారుచేస్తున్నారో తెలుస్తుంది, వాళ్ళకంపెనీ గూర్డుకు పొగాకు తీసుకొనిపోయిన తరువాత, వాళ్లు అడిగినధరకు ఇవ్వలేకపోయినా, లేక వాళ్లకు యిష్టములేకపోయినా వెంటనే ఆరోజే, వర్షము కానివ్వండి, ఎండకానివ్వండి, పదిమైళ్ళదూరము వెనుకకు తీసుకురావలసి యుంటుంది. ఈ పొగాకు market సంచర్భంలో రైతులు తనకు గిట్టుబాటయినధర రాకపోతే, కొన్నిరోజులు సరుకును అట్టే పెట్టుకోడానికి వారికి ఏలాంటి Ware House సౌకర్యాలులేవు. ముప్పయికోట్ల రూపాయలు excise dutyగడిస్తున్న కేంద్రప్రభుత్వముగాని, కొన్నిలక్షలు గడిస్తున్న రాష్ట్రప్రభుత్వము గాని ఈ పొగాకు రైతులకు ఎలాంటి Ware House సౌకర్యాలు కలుగ చేయడంలేదు. అసలు విషయంలో మాత్రం వీరు ఏమి చేయడంలేదు. ధరలు control చేసే విషయంలో మేము ఏమి చేసేదిలేదు, అదంతా కేంద్ర ప్రభుత్వంనుంచి, పన్నులు వేసుకోవడమే మాపని అంటున్నారు. Excise duty గురించి వీరు చెప్పేటటు వంటి అభిప్రాయ మేమిటంటే—"The present tariff for unmanufactured tobacco should therefore continue but classification of varieties made for the purpose of assessment should be reviewed by the Expert Committee which should include a marketting expert in tobacco and representatives of trade. ఈ taxes విషయంలో State Government వీటిమీద పన్నులు వేసుకోవాలి. వీటిమీద వేసుకోకూడదు అని review చేసే విషయంలోకూడ, ఈ కమిటీవారు చేసిన recommendations లో పొగాకు మీద మాత్రము ఏవిధంగాను వేయడానికి వీలు లేదని చెప్పారు. ఇతర వస్తువుల విషయంలో, అంటే kerosine, cement, sugar ఇట్లాంటి వాటిపైన tax చేసేందుకు recommend చేసినారు గాని పొగాకు మీద మాత్రము వేయడానికి వీలులేదు. ఇప్పటికే వారికి చాలా భారముగా ఉన్నదని సలహా ఇచ్చారు. అందులో ఈ విధంగా చెప్పారు. "Several complaints have been received by us about unduly heavy burden of control, States and local taxes on tobacco and tobbacco manufacture. The need for ensuring proper co-ordination between the different taxes on tobacco levied by different authorities is obvious. We consider that such co-ordination could best be evolved by Inter-State Taxation Council."

తరువాత ఈ రైతులకు అప్పులు ఇచ్చే సౌకర్యాలు ఉన్నవని మన co-operative మంత్రిగారు ఈ సభలో చాలాసార్లు చెప్పారు. గాని మామూలు రైతులకు,

వారి భూమి పరిమితిని బట్టి, ఎకరాకు 50 లక్షలో, మరెంతో నిర్ణయించారు. ఒక రైతుకు maximum 6 వందలవరకు ఇచ్చిన సందర్భాలున్నాయి. కాని ఒక్క పొగాకు రైతుకు మాత్రం ఇదివరకు అలాంటి అప్పు ఇచ్చినట్లు కనపడదు. కావలసివస్తే మీరు విచారించి తెలుసుకోండి.

THE HON. SRI B. GOPALA REDDI :—పొగాకు వ్యాపారస్థులకు అక్కరలేదు.

SRI B. VENKATASIVAYYA :—పొగాకు వ్యాపారస్థులకు కాదు, పొగాకు రైతులవిషయం చెప్పుతున్నాను. రైతులనుకూడ వ్యాపారస్థులనుకొంటే ఘోరములేదు. ఏలాంటి సందర్భంలోను పొగాకు రైతులకు ఏవిధమైన అప్పులు ఇచ్చే సౌకర్యములేదు. తక్కినరైతులకు co-operative societies ద్వారా, Agriculture Department ద్వారా అప్పులు యిస్తున్నారు. ఆరువందలువరకు, కాని పొగాకు రైతులకుమాత్రం ఇవ్వడంలేదు. Market సందర్భంలో వారికి గిట్టు బాటుధర వచ్చేవరకు సరుకు నిలవచేసుకోడానికి Ware House సౌకర్యాలుకూడా లేవు. కనీసము I. L. T. D. లాంటి కంపెనీలదగ్గర తమవరకు గిట్టుబాటయ్యేవరకు stock చేసుకోడానికి Ware House సౌకర్యాలు లేకుండా చేశారు. తరువాత ఈ commercial crops గురించి marketing committees కొన్ని స్థాపించారు.

తరువాత commercial crops కోసము మార్కెటింగు కమిటీలను కొన్నిటిని స్థాపించారు. అవి నామమాత్రముగానే వుంటున్నవి. అన్ని కమ్మర్షియల్ క్రాప్సుమీద యీ విధంగా పన్నువేస్తే మార్కెటింగు కమిటీలకు కనీసము Ware Housing facilities చూపించడములోగాని, యింకా యితరసౌకర్యాలు కలుగజేయడములోగాని ప్రోత్సహించుటకు ఒక దమ్మిడీఅయినా వారికి సహాయము చేయడములేదు. కేంద్రప్రభుత్వమువారుకూడా దానితో మాకు ఏలాంటి సంబంధము లేదుఅని అన్నారు. అది state Government కు సంబంధించిందట. Gunturలో re-drying factory ఒకటి కావాలని పదిసంవత్సరాలుగా ఆందోళనచేస్తూ, గోల పెట్టుతూంటే, పది సంవత్సరాలక్రింద మిషీనరీ అంతా తెప్పించారు కాని, దాన్నియింతవరకు నిర్మించి వుపయోగపడేటట్లు చేయలేదు. ప్రభుత్వమువారు ఏ ఉద్దేశ్యముతో దాన్ని మేము కట్టలేము అని చెబుతున్నారో గాని తెలియదు. ఆ మిషనరీ అంతా ఎండకుఎండి వానకు తడిసి చెడిపోతున్నది. బాయిలర్సు ఉపయోగించక పోవడముచేత అందులో పేదవాళ్లు కాపురాలుకూడా వుంటున్నారు. ఆ విధముగా దుర్వినియోగము ఎందువల్ల చేస్తున్నారు అని అడిగినవారులేరు. ఇది

రుజువు కావాలంటే, మంత్రిగారు ఒకపర్యాయము ఆ రోడ్డువెంట వెళ్ళి, ఆ boilers వంక చూస్తే, నిజస్థితి బయటపడుతుంది. Boilers లో కాపురాలు చేస్తున్నారంటే నమ్మండి. అంటే, యీ మిషనరీ అంత neglected గా పడివున్నదని గుర్తించాలి. సుమారు నాలుగైదు లక్షలు పెట్టి యీ machinery ని తెప్పించారే గాని, యిప్పటికి అది తెప్పించి పదిసంవత్సరాలు అయింది. ఆ machinery అంతా idle గా పడివుండడము సహించరాని విషయముగా వున్నది. అది అందరికి సంబంధించిన సంస్థ, ప్రభుత్వానికి సంబంధించిన సంస్థ అయినప్పుడు, Marketting Committee వారు గాని, ప్రభుత్వముగాని ఏలాంటి జోక్యము కలుగజేసుకోకుండా వున్నారు. ఈ నాలుగుఅయిదు లక్షలకు యీ పది సంవత్సరాలనుంచి ఎంతవడ్డీ నష్టము అయివుంటుందో గుర్తించాలి. ఇన్నాళ్ళనుంచి అది అక్కడపడవైచినప్పుడు, అది ఎంత చెడిపోయిందో ఎవరికీ తెలియదు. చివరికి యీనాడు దానికి బహిరంగముగా వేలము వేయిస్తామని, వేలమునోటీసు యిచ్చారు. ఇంతవరకు దానికి అయినదండుగ ఎవరు భరించేటట్టు ? దానిని యీరోజున వేలము వేస్తే, ఎంతసొమ్ము తెస్తుందో చూడాలి. ఈలాంటి పరిస్థితులలో పొగాకుమీద ప్రభుత్వమువారు పన్ను వేయ తలపెట్టారంటే, అది సమర్థనీయము కాదు. పుగాకుమీద పన్ను వేయక తప్పదు, మాకు రెవిన్యూరావాలి అని ప్రభుత్వము చెబుతున్నప్పుడు, 0-0-6 పన్ను వేస్తున్నప్పుడు చివరకు ఒక దమ్మిడీఅయినా ఎవరివద్దనుంచి ప్రభుత్వము వసూలు చేయదలస్తున్నదో వారికి ఆ దమ్మిడీవంతుఅయినా లాభము, మేలు కలుగజేయుడము ధర్మము అని ప్రభుత్వము గుర్తించగూడదా ? ఈ పన్నును మాత్రము, శ్రీ నాగేశ్వరరావుగారు చెప్పినట్లుగా కనీసము ఒకసంవత్సరము అయినా limit చేసుకొని, యీలోపల పుగాకురైతులకు జరుగుతున్న అన్యాయములు యేమిటో తెలుసుకొని, అవి నిజమే అయితే, మరల యింకొక సంవత్సరముపాటు పొడిగించుకోవచ్చును. లేకపోతే పర్మనెంటుగా పన్ను వేయకుండా వుండే ఆలోచనఅయినా చేయడమో, అదంతా ఆలోచించిచేస్తే, అది ప్రభుత్వానికి సమర్థనీయము. సభ్యులమైన మనమందరము యీ శాసనసభ ముగిసిన తదుపరి, ప్రజలవద్దకు పోతున్నాము కనుక, యిప్పుడు యీ పన్ను వేయటానికి, మనం ఆమోదించామని చెప్పటానికీ మనకు కొన్ని కారణములు కనబడాలి, ప్రజలు అడిగితే సమాధానము చెప్పవలని వుంటుంది. వారు అడిగినప్పుడు యీయీ కారణములవల్ల, యీ పన్నును వేశాము. ఈపన్ను వేయడము యీయీ కారణములచేత న్యాయము, ధర్మము అని చెప్పటానికి వీలుగావుండాలి. కాబట్టి నాగేశ్వరరావుగారు చెప్పినట్లు యీపన్ను విషయములో దాని పర్యవసానముఅంతా పరిశీలించి, మరల యీ బిల్లును re-enact చేసుకోటానికి వీలుగా provision ప్రభుత్వము కల్పిస్తారని నేను ఆశిస్తున్నాను.

[4th October 1955

MR. SPEAKER :—Limit చేయడముకాదు. Revise చేయడము అంటారు.

*SRI T. JALAYYA:—అధ్యక్షా, పుగాకు మీద Sales tax వేయటానికి మంత్రిగారు Sales Tax Bill ను ప్రవేశపెట్టినందుకు వారిని నేను అభినందిస్తున్నాను. (Hear Hear). అయితే శాస్త్రము యేమి చెప్పిందంటే, సూర్య భగవానుడు తడి ఎక్కడవుంటే, అక్కడినుంచి దాన్ని లాగుకుని, అవసరము వచ్చినప్పుడు దానిని వర్ష రూపములో పంటలు పండించటానికి మనకు తిరిగియిచ్చే సదుపాయము చేస్తున్నాడు. అదేవిధముగా ప్రభుత్వముకూడా రైతులవద్ద డబ్బు తీసుకొని. వారికి కావలసినప్పుడు నీటి సదుపాయముల ద్వారా తిరిగి సహాయము చేస్తున్నది. అందువల్ల పన్నులు వేయడములో ఏలాంటి అభ్యంతరము వుండకూడదు అని నా అభిప్రాయము. పన్నులు వేసినప్పుడు, అవి కట్టవలసినదే. తిరిగి ప్రభుత్వము నుండి సహాయము కోరవలసిందే కాబట్టి సూర్యభగవానుడు తడిని లాగుకొని మరల పంటల కోసము వర్ష రూపములో నీటి సదుపాయములద్వారా ప్రజలకు సహాయము చేస్తున్నాడు. అదేవిధంగా ప్రభుత్వము రైతులవద్ద డబ్బు పన్నుల రూపములో లాగుకొని, తిరిగి రైతులకు నీటి సదుపాయములుద్వారా ప్రజలకు సహాయము చేస్తున్నది. అయితే ప్రభుత్వము ఎంత పన్ను వేసినను అభ్యంతరము వుండదుగాని, రైతులు పండించిన పంటకు సరియైన మార్కెటింగు facilities చూపించవలసిన బాధ్యత ప్రభుత్వము పెట్టుకోవడము, అది ఉత్తమమైన మార్గమని చెప్పవచ్చును. ఉత్తమం స్వార్జితం విత్తం అన్నరీతిగా ప్రపంచములో ఏ మనుజుడినో స్వంతముగా సంపాదించుకోవడము ఉత్తమమైన మార్గము అనిపించుకుంటుంది. అదే విధముగా ప్రభుత్వముకూడా ఉత్తమ మార్గము నవలంభిస్తుందని నేను భావిస్తున్నాను. గనుక నేను ప్రభుత్వానికి చెప్పదలచింది యేమిటంటే, ప్రభుత్వము రైతులవద్ద పన్ను ఎంతైనా వేసి వసూలు చేసుకోవచ్చు. కాని రైతు పండించిన పంటకు తగిన మార్కెటు ప్రభుత్వమే ఏర్పాటు చేయాలి. అది జరిగినప్పుడు రైతుమీద ఎంత పన్ను వేసినా రైతుకుగాని వర్తకునికిగాని కష్టము అనిపించదు. ధాన్యాదులు కొనుక్కొని తినేవాడికికూడా కష్టము అనిపించదు. ప్రభుత్వము Marketting facilities కలుగ చేయడానికి సిద్ధము అయితేనే తప్ప పన్నులు వేయడము సబబు కాదు. పన్నులు వేయండి. రైతునియొక్క పంటకు మార్కెటు సదుపాయములకు సహాయము చేయండి. అది క్రమమైన పద్ధతి అని అంటున్నాను. ఇటువంటి మార్కెటు సదుపాయములు ఏవీకూడా చేయకుండా పన్నులు వేసి వసూలు చేస్తాము అంటే అది సబబు అనిపించదు. రైతునియొక్క సరకు అమ్ముకుంటేగదా, రైతుకు

డబ్బు వచ్చి, అప్పుడు ప్రభుత్వానికి పన్ను కట్టగలుగుతాడు? గనుక ప్రభుత్వము యేవిధమైన సహాయము చేయకుండా పన్నులు వేసి వసూలుచేయడమనేది క్రమమైన పద్ధతి కాదని అంటున్నాను. ప్రభుత్వము వారిని నేను కోరేది యేమిటంటే, రైతు పండించిన పంట నష్టపడకుండా తగిన మార్కెటు సదుపాయములు చూపించ గల పద్ధతిని అవలంభించవలసిందిగా కోరుతున్నాను. ముఖ్యంగా multi-point పద్ధతి కాకుండా single-point పద్ధతితో యీ పన్ను వేయడము చాలాసంతోషము. వర్తకులు కష్టపడకుండా ఒక్కచోటనే పన్నులు వసూలుచేసే పద్ధతిని, ప్రభుత్వానికి ఖర్చులేకుండా వసూలు చేస్తున్నారు. ఈ సందర్భములో కొన్ని విషయాలను చెప్పదలచుకున్నాను. కేంద్ర ప్రభుత్వమువారు గుంటూరు జిల్లాలో ఒక మార్కెటింగు కమిటీని స్థాపించారు. 1944 వ సంవత్సరములో నేను గుంటూరు మునిసిపల్ చేర్మనుగా వుండగా, దాన్ని నేను open చేసినట్లు జ్ఞాపకము. కాని చివరకు అది ఎత్తి వేసే పరిస్థితి వచ్చింది. Marketting Committee ఏర్పాటు చేసేటట్లు అయితే, compulsory మార్కెటింగు అమలులోకి పెట్టినప్పుడే, రైతులు లాభము పొందుతాడు. అంతే కాని ఏదో ఒక మార్కెటింగు కమిటీ పెట్టారంటే, అది ఒట్టి మార్కెటే అవుతుంది. రైతులకు మేలు కలుగదు. అది కూడా నేను ఆ రోజునే చెప్పాను. అక్కడ మార్కెటింగు కమిటీని ఏర్పాటుచేశారు. యావత్తు మార్కెటింగు అక్కడనే జరగాలని ఆదేశించారు కాని, యీ కమిటీ సరియైన పద్ధతితో పనిచేయలేదు. రైతులే మాకు యీ మార్కెటింగు కమిటీ వద్దు, ఈ మార్కెటింగు యార్డువద్దు అని, చివరకు ఆ కమిటీని ఎత్తివేసిన దాకా గోలపెట్టి రైతులే కొంతమంది వర్తకులతో లాలూచి అయి చివరకు కమిటీని తీసివేసినదాకా పోరాడి చివరికి తీసివేయించారు. ఈ మార్కెటింగు కమిటీ రద్దు కావటానికి రైతులు వర్తకులు, యీ యిరువురు కారణమని చెప్పక తప్పదు. పెద్ద పెద్ద రైతులే వారికి సరియైన ధర రాలేదని చాటుగా ఎక్కువ ధరకు అమ్ముకోవడానికి ప్రయత్నించారు. మార్కెటింగు కమిటీద్వారా సరియైన ధర వస్తూంటే, యింకా ఎక్కువ ధరకోసం ఆశపడి, ముందుగా అప్పులు యిచ్చి ఎక్కువ ధరకు చాటుగా అమ్ముకోవటానికి ప్రయత్నము చేశారు. ఆవిధంగా అమ్ముకుని లాభాలు సంపాదించుతూయున్నారు. అంటే ముందుగా అప్పులు యిస్తే, మార్కెటు ధరకన్నా పుట్టికి వంద, రెండు వందలు, వత్తిడినిబట్టి ఎక్కువ ధర వస్తుందన్న ఉద్దేశ్యములో రైతులు వర్తకులు రైతులు లాలూచీ అయి యీ మార్కెటింగు కమిటీకి డబ్బు యివ్వకుండా ఎగగొట్టటానికి చాటున మాటున అమ్ముకోవటము సాగించారు. అందువల్ల యీ మార్కెటింగు కమిటీకి డబ్బు రాలేదు. చివరకు దాన్ని ఎత్తివేయవలసి వచ్చింది. ఇది ఎత్తివేయటానికి రైతులే ఎక్కువ ధర కోసము, యీ మార్కెటింగు కమిటీని

Sri T. Jalayya] [4th October 1955

boycot చేశారు. ఎక్కువ ధరకు అమ్ముకోటానికి యీ మార్కెటింగు కమిటీ అడ్డంకుగా వున్నది. కాబట్టి రైతులే వర్తకులను ప్రోత్సహించి మార్కెటింగు కమిటీని రద్దు పరిచించారు. కనుక నేను కోరేది యేమిటంటే, మన భారతదేశము మొత్తమువిూద 2 లక్షల 19 వేల టన్నుల పుగాకు పండుతుంది. అందులో ఆంధ్రరాష్ట్రములో 98 లక్షలటన్నులు పండుతుంది. మొత్తమువిూద మన ఆంధ్రస్టేటునుంచి 12 కోట్ల 77 లక్షల రూపాయలు ఖరీదుచేసే పుగాకు ఎగుమతి చేస్తున్నాము. ఈ పన్నెండుకోట్లలో ఆరుకోట్లు ఖర్చులకే సరి పోతున్నది. మిగతా ఆరుకోట్లు మనకు మిగులుతుంది. మన రాష్ట్రములో రెండు లక్షల యకరాలలో పుగాకు ఉత్పత్తి చేస్తున్నారు. ఎకరానికి average విూద 3 వందలరూపాయలకంటె ఎక్కువ మిగలదు. అంటే average విూద ఎకరానికి 12 రూపాయలు పన్ను పడుతుంది. అంతేకాని ఎకరానికి 40, 50 రూపాయలు పన్ను పడుతుందని అనుకోవటము పొరబాటు. ఈ సంగతి 1953-54 వ సంవత్సరపు లెక్కలనుబట్టి నేను చెబుతున్నాను. ఎకరానికి 12 రూపాయలు పన్నువేసినా, 25 రూపాయలువేసినా, మంత్రిగారు వెంటనే కంకణము కట్టుకొని రైతులకు యీ పంట అమ్ముడుపోయేటట్లుగా మార్కెటింగు సదుపాయములు కలిగిస్తారని ఆశిస్తున్నాను.

సిగరెట్లమీద ఎక్కువగా పన్నువేయడము అవసరమే. అయితే మిగతా వంగ రాష్ట్రములోగాని, కలకత్తాలోగాని యీ సిగరెట్లమీద పన్నులేదు. మనదేశములో మాత్రమే వేస్తున్నారు. సిగరెట్లమీద పన్నువేయకముందు మనకు ఎంతTurn over వచ్చింది, వేసినతరువాత ఎంతవచ్చింది, అనే వివరాలు చూచుకుంటే, ఇంకా 50% తగ్గిందని నా ఉద్దేశ్యము. ఈ పన్ను మిగతా రాష్ట్రాలలో వేయకపోవడమువల్ల మన రాష్ట్రములో వేయడమువల్ల యితర రాష్ట్రాలనుంచి పదివేలు, యిరవైవేలు, ముప్పయివేలు రూపాయలు ఖరీదుచేసేవరకు ఎగుమతి అవుతున్నది. కలకత్తాలో సిగరెట్టుపెట్టె ఒకటింటికి ఖరీదు 0-12-0 అయితే, మనరాష్ట్రములో 0-15-0 లు వున్నది. మన రాష్ట్రముకంటె యితర రాష్ట్రములలో పెట్టె 1 కి ఖరీదు మూడు అణాలు తక్కువ వుంటున్నది. మనకు యిక్కడ ఎక్కువగా ఖరీదువుంటున్నందు వల్లనే మనకు ఈ పన్నుద్వారా ఆదాయము ఎక్కువ రావడములేదు. ఈ పన్ను లోటును భర్తీచేసుకోటానికి ప్రభుత్వము యిప్పుడు ఎక్కువపన్ను వేస్తున్నందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. ప్రభుత్వము పన్నుఎంత ఎక్కువగా వేసినప్పటికిని పొగాకుకు తగినమార్కెటు సదుపాయములు చూపించి పన్నువేయటానికి ప్రారంభించినట్లయితే, రైతు పన్నుకట్టటానికి కష్టము వుండదు. ప్రభుత్వమువారు అటువంటి పద్ధతిని అనుసరిస్తారని ఆశిస్తూ యీ బిల్లును ప్రవేశపెటుతున్నందులకు నేను అభినందిస్తూ, దీన్ని అంగీకరిస్తున్నాను.

Sri M. BAPAYYA CHOWDARY :—అధ్యక్షా, నా మిత్రులు పుగాకుమీద యీ Sales tax బిల్లును గురించి చాలా విపులముగా విమర్శించుతూ మాట్లాడారు. ఈ విషయములో నేనుగూడా కొన్ని విషయాలు మాట్లాడదలచుకున్నాను. ఈ పన్ను రైతులకు ఏమాత్రము తగలదు. Consumer కు గూడా తగలదు. వ్యాపారముచేసేవారికే తగులుతుందని సామాన్యముగా ప్రభుత్వమువారు చెప్పటము సంభవిస్తున్నది. 1952-53 వ సంవత్సరములో కేంద్రప్రభుత్వమువారు ఒకఅణా పన్నుతగ్గిస్తే, అప్పుడు నిలవవున్న ఆరు సంవత్సరాల సరకు అమ్ముడుపోయింది. మరల 1953-54 వ సంవత్సరములోకూడా ఒక అణాతగ్గిస్తే ఆ సంవత్సరముకూడా సరకుఅంతా అమ్ముడుపోయింది. అందువల్ల ఈపన్ను తప్పకుండా రైతుకు consumer కు తగులుతుందనేది దృష్టిలో పెట్టుకొని యింకా అవసరమైతే ఎక్కువగా వేసుకోవచ్చునుగాని, రైతులకు తగలకుండా వేస్తున్నామని ప్రభుత్వము చెప్పడము సమర్థనీయముకాదు. సాధ్యమైనంతవరకు తగ్గిస్తే మంచిదని చెబుతూ విరమిస్తున్నాను.

Sri T. VEERARAGHAVULU :—అధ్యక్షా, మంత్రిగారు తెచ్చిన యీ బిల్లును నేను బలపరుస్తూ, ఒకటి రెండు విషయాలు మాత్రము మనవిచేయదలచాను. ఇప్పటివరకు జరిగిన గౌరవనీయులైన సభ్యుల ప్రసంగాలలో నాకు రెండు విషయాలు కన్పించినవి. ఈ పన్ను అనేది ఉత్పత్తిదారులకు తగలకుండా చేయాలని కోరుతూవున్న విమర్శ పూర్వకమైన సంభాషణ ఒకరకము. రెండవది వ్యాపారస్థులకు తగలటానికి వీలులేదని, ఒకవేళ తగిలేటట్లైతే, చిన్న చిన్న వ్యాపారస్థులకు తగలకుండా వుండేటట్లు, వారికి margin of profit కు ఏలాంటి యిబ్బందిలేని పద్ధతిలో వుండాలని, చెప్పడము జరిగింది. కాని యీ వుభయులే కాకుండా యింకొకరు మూడవవారువున్నారు. ఆయన అటు వ్యాపారస్థుడుకాడు, యిటు ఉత్పత్తి దారుడుకాడు. ఆయనను గురించి చెప్పడమూ యీ సందర్భములో చాలా అవసరమని అనుకుంటున్నాను. ఆయన ఎవరంటే సరకుకొనుక్కొని అనుభవించేవాడు. ఆయనను Consumer అని అంటారు. అసలు యీ విషయములోనే కాదు. ప్రతివిషయములోగూడా, యీ రోజున ఉత్పత్తిదారులు అందరు సంఘటితమై, వారియొక్క సాధకబాధకాలు చెప్పుకునేస్థితిలో వున్నారు. ఆవిధంగానే వ్యాపారస్థులుకూడా సంఘటితముగానే వున్నారు. వారుకూడా వారియొక్క సాధకబాధకాలు చెప్పుకునే స్థితిలోవున్నారు. ఇక యీ consumer అంటే సరకుకొనుక్కొని అనుభవించేవారు, పాపము! చిల్లరచిల్లరగాను, చెదురుమాటుగాను సంఘటితముగా కొన్ని కారణములచేత యీ పన్నుల భారముఅంతా మోస్తున్నప్పటికినీ వారు

తెలుసుకొని అనుభవిస్తున్నప్పటికినీ, వారియొక్క సాధకబాధకాలు చెప్పుకోటానికి వినేవారులేరు. భారము మోయవలసివస్తున్నది. ఏమి చేస్తాడు? వేరేగత్యంతరము కనబడదు. ఈ సందర్భములో నాకు తెలుగులోవున్న ఒకసామెత జ్ఞాపకము వస్తున్నది. అదేమిటంటే, "త్రాగేవాడే తాళ్లపన్ను పెట్టుకుంటాడు, భారముమోస్తాడు. అని" అయితే యిప్పుడు రాష్ట్రంలో Prohibition వున్నది. అయిననూ యిది ఇక్కడ అప్రస్తుతము అనుకుంటాను. అయితేకానచ్చు. ఆ విధంగానే పొగత్రాగేవాడే, పన్ను పెట్టుకుంటాడు అనేది కనబడుతున్నది. (Interruption) నాయొక్క ఉపన్యాసములోని ప్రాస, యతి, మంత్రి వెంకట్రావుగారు బాగా, జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు. అయితే జాలయ్యగారు యీ బిల్లును తెచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందించారు. నేనుకూడా అభినందిస్తున్నాను. ఎందుకంటే ఘటకుటికా ప్రభాంతన్యాయము అని ఒక న్యాయమువుంది. "కాదు" అన్నా, "అవును" అన్నా, అటుతిరిగి, యిటుతిరిగి ఎటుతిరిగినా, ప్రభుత్వమువారు తప్పనిసరిగా అక్కడికేవస్తారు. పూర్వము టోలి గేటు అని ఒకటి పురము వెలుపలవుండేదట. అంటే పురమువెలుపల వారందరు పురము లోపలికివచ్చి సరకులు అమ్ముకొనటానికివచ్చి ఒక టోలిపన్నుయిచ్చి, మార్కెటులో ప్రవేశించి, అమ్ముకోవడము జరుగుతూవుండేదిట. పాపము! ఒక గొల్లఅమ్మాయి యీ మార్కెటులోకివచ్చి, చల్లతెచ్చుకొని అమ్ముకోటానికి పోతూండేది. పాపము! చల్లఅమ్ముడుపోయినా, పోకపోయినా టోలిమాత్రము యిచ్చిపోవలసివుంటూ వుండేదట. ఈవిధంగా జరుగుతూవుంటే, యీటోలి యివ్వటానికికూడా బాధపడడమువల్ల, ఆ అమ్మాయి రాత్రిపూటనే బయలుదేరి గేటువద్దకువచ్చింది. అక్కడికి వచ్చేసరికి ఆ గేటు కొస్తామూసివున్నది. ఆ రాత్రిఅంతా గేటువద్ద చల్లగాలిలో పడివుండి టోలి యివ్వడము తప్పనిసరి కాబట్టి, వుదయముననేలేచి, గేటులో టోలియిచ్చి, తెచ్చిన చల్లఅమ్ముకున్నది. అది ఘటకుటికా ప్రభాంతన్యాయము అని అంటారు. కనుక ఆ విధంగానే మనము అవునన్నా, కాదన్నా, మొత్తమువిూద ప్రభుత్వమువారికి డబ్బు చాలా అవసరముగనుక మనము అందరము అందుకు ఒప్పుకుంటున్నాముగనుక, యీ పన్నునుగురించిన బిల్లును మంత్రిగారు ప్రతిపాదించటములో తప్పేమిలేదు. మనమందరమూ బలపరచవలసిందే. దీనికి వివాదము యేమీలేదుకాని, నేను ఒక్కసంగతి మాత్రము మనవిచేస్తున్నాను, ఈవిషయంలో ఎంతో పన్నులు ఇచ్చినటువంటి రైతులకు కూడా ఎటువంటి సదుపాయముచేయకుండా వారిని సరిగా చూడడములేదనే భావము వెల్లడిచేయడముకూడా జరిగింది. కాని Imperial Council of Agricultural Research Institute ను గురించి చరిత్రను చూచినట్లయితే మనవిూద అభిమానము

ఉన్నా, లేక పోయినా అప్పటి రోజులలోవుండే ప్రభుత్వమువారు ఈవాణిజ్య వ్యాపారపంటలనే ఎక్కువగాతీసుకొని వాటిమీద research చేయడమనేది అవసరమని తోచి చెఱకు గురించి, పొగాకును గురించి తరువాత cotton ను గురించి ఎక్కువగా శ్రద్ధ తీసుకున్నట్లుగా మనకు చరిత్రవల్ల ప్రసిద్ధంగా తెలుస్తున్నది. ఈ సదుపాయం చాలునుఅని నేను చెప్పుటలేదు. ఇప్పటివరకుకూడా చేసింది ఏదో కొంత జరిగినప్పటికి ఇంకా చేయవలసింది యింకా చాలా వున్నది. మార్కెటింగు ఫెసిలిటీనే ఇచ్చి రైతుమీద పన్నులు వేసినంత మాత్రముచేత మేము బాధపడము అనిచెప్పి జాలయ్యగారు చెప్పినారు. అది యథార్థమే, రైతుకు రాబడి చూపించవలయుననేదికూడా మనం ఆలోచించవలసిన విషయము. మన రాష్ట్రప్రభుత్వముకూడా ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధచూపించి సానుభూతితో వాళ్ళకు Marketting facilities కలిగించినప్పుడు వారిని గుత్త వ్యాపారస్థులు, విదేశవ్యాపారస్థులు పిడికిళ్లలో పెట్టుకొని వారు చేసేటటువంటి మోసము, దగా ఇటువంటివి చేయకుండా వీటికి రక్షణ కల్పించడానికి ఏదైనా సక్రమమైనటువంటి పథకము ఒకటి ఏర్పాటుచేయించవలసినదని ప్రభుత్వమువారిని నేను కోరుతున్నాను. ఈ బిల్లులో నాకు సంబంధించినంతవరకు చిన్న స్వార్థముకూడా వున్నది. చుట్టమీద పన్ను మినహాయించారు కాబట్టి ప్రభుత్వమువారిని నేను ప్రత్యేకంగా అభినందించాలో ఇది కేవలం common man విషయము కాబట్టి వాటిమీద సదుపాయం చేయటానికి common man పట్ల మీకువున్న సానుభూతి ఈ విధంగా చూపించారని మనవిచేస్తూ నాటు పొగాకుపైనకూడా మినహాయించారు కాబట్టి మిమ్ములను అభినందిస్తూ ఈ తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ప్రభుత్వమువారు ఈబిల్లు తీసుకు వచ్చినందుకు నేను మిమ్ములను అభినందించలేను. చాలా తీవ్రంగా విమర్శించవలసి వుంటుంది. కారణము యేమిటంటే ఏదో అభివృద్ధి కార్యక్రమాలు చేస్తున్నారు. పన్నులు కావాలి అని అంటున్నారు. అందుచేత మీకు దొరికేది ఈ బీదలు మధ్య తరగతి ప్రజలు, రైతులు వీరిమీద వేయడము ఒక్కటే ప్రభుత్వానికి మిగిలింది కాబట్టి వారు ఆ దారిలో పోవడము అవసరము అని చెబితే దానిని ఎవరూకూడా బలపరచరు. ఇప్పుడు ఈపన్నులు లేకుండా ఈ కార్యక్రమాలు ఏరీతిగా చేయాల్సివుంటుంది, అని అడుగుతున్నాను. అసలు కేంద్రప్రభుత్వముతో ఈ విషయంగురించి ప్రభుత్వము ఏమైనా దెబ్బలాడించా ? ఆంధ్రప్రభుత్వము ఆంధ్రప్రజలమీద కొత్తపన్నులు వేసేదానికిముందు ఇదివరకు ఆంధ్రప్రజలు ఎవరిని తీసుకుపోయినా పన్నుల్లో సరియైన వాటా యిచ్చేదానికోసము ప్రభుత్వము ఏదైనాగట్టిగా దెబ్బలాడి వారినుంచి ఏదైనా

Sri P. Sundarayya] [4th October 1955

డబ్బు తెచ్చుకు నేదానికి ప్రయత్నము చేసిందా? అదిలేకుండా ఈరోజున కొత్త పన్నులు వేయాలని చెబుతున్నారు. వుదాహరణకు ఈ Taxation Enquiry Committee Report లెక్కలు కాకుండా Taxation Committee లెక్కలు యిస్తున్నాను. 1951 లో income మీద ఆదాయపుపన్ను 146 కోట్లు వస్తున్నది. 1954-55 లో 126 కోట్లు రూపాయలు వచ్చింది. అంటే 20 కోట్ల రూపాయలు ఆదాయము వచ్చేవాళ్లమీద పన్నులు తగ్గించారు అన్నమాట. పెద్ద పెద్ద ఆస్తులు ఉన్నటువంటి వాళ్లమీద సంవత్సరానికి ఈమధ్య 2000 రూపాయలు చేశారు అనుకోండి. పెండ్లికాని వారిమీద 2000 రూపాయలు, పెండ్లిఅయినవారి మీద 3,600 రూపాయలు మించినవారిమీద పన్ను వేశారు. అంతఆదాయము సంవత్సరానికి వచ్చేవాళ్లమీద సర్‌చార్జి అంతకుముందే తీసివేశారు. Excess pro it tax అంతకుముందు తీసివేశారు. ఇప్పుడు Income Tax లో కూడా, బాగా ఆదాయం వచ్చేవాళ్లమీద Income-tax తగ్గించి సంవత్సరమునకు 20 కోట్ల రూపాయలు తీస్తారు. గతసంవత్సరము ఆదాయమును సెంట్రల్ గవర్నమెంటు పోగొట్టుకుంది. ఇదేరీతిగా కార్పొరేషను టాక్సులు పెట్టినప్పుడు అవి బాగా లాభాలు సంపాదించు కున్నవి. వాళ్లకు 1951 లో 41 కోట్ల రూపాయలువుండి దానిని తగ్గించారు. కొత్తగాకూడా ఫ్యాక్టరీలు పెట్టినారు. తాతాకంపెనీకి 2 నెలలు క్రిందటే 80 రూపాయలు పన్ను ఎక్కువ చేశారు. మరల నిన్న యింకా 80 రూపాయలు ఎక్కువ చేశారు. ఖర్చులు పెరగలేదు. కాని ఇనుము చాలా అవసరం. ఉక్కు చాలా అవసరం. కొనేవాళ్లు కావలసినంతమంది వున్నారు కొబట్టి విపరీతంగా ధరలు పెంచుతున్నారు. పోనీ ధరలుపెంచినా లాభాలు ప్రభుత్వము తీసుకుంటోందా అంటే ప్రభుత్వము తీసుకోకుండా ఈ తాతా లాంటి కంపెనీలకు ఇవ్వడము జరుగుతోంది. ఈరీతిగ మరల కార్పొరేషనుకు 4 కోట్లు tax తగ్గించారు. ఒకప్రక్కన ఈ ధాన్యాలమీద పడే పన్నులు తగ్గిస్తూ, రెండవప్రక్కన సామాన్యప్రజానీకముమీద పడేటటువంటి ఎక్సైజుపన్నులు ఎక్కువ చేస్తున్నారు.

1951 లో 85 కోట్ల రూపాయిలు Union Taxes, Excise Taxes వేస్తే ఈ రోజున 1954-55 లో 104 కోట్ల రూపాయిలు వస్తున్నాయి. ఒక వైపు ధనవంతులమీద సంవత్సరానికి 20, 25 కోట్ల రూపాయిలు పన్నులు తగ్గించడం; మరొకవైపు సామాన్య ప్రజానీకం మీద సంవత్సరానికి 20 కోట్లు రూపాయిలు పన్నులు వేయడం Central Government అవలంభిస్తోంది. ధనవంతుల మీద పన్నులు తగ్గించి, పేదలమీద పన్నులు వేసే పద్ధతికి మీరు ఎందుకు పూను

కుంటున్నారు; ఈ విధానం మార్చాలని మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వంతో చెప్పినదా? ఆ విషయంలో ఏమైనా చర్య తీసుకొన్నదా? అటువంటి తీసుకోనంత కాలం మాకు డబ్బు కావాలి కాబట్టి పన్నులు వేస్తాము; ముక్కుపొడి మీద పన్ను వేస్తాం; చుట్టమీద పన్ను వేస్తాం; బీడీలమీద పన్ను వేస్తాం: నమిలే పొగాకుమీద పన్ను వేస్తాము; హోటలుమీద పన్ను వేస్తాము; తిండిమీద పన్ను వేస్తాము జుట్టుమీద పన్ను వేస్తాము; అన్నింటిమీద పన్ను వేస్తాము అంటే ఇది ప్రజలు హర్షించే పద్ధతి కానేకాదు. వేసిన పన్నులలో అయినా మనకు రావలసిన వాటా సరిగ్గా ఇస్తున్నారా అంటే అది కూడా లేదు. పొగాకు సంగతి తీసుకుంటాము. 35 కోట్ల రూపాయిలు చొప్పున గత 2,3 సంవత్సరాలుగా కేంద్ర ప్రభుత్వానికి పొగాకుమీద సిగరెట్లుమీద Excise Duty క్రింద వస్తోంది. ఈ డబ్బులో మనకు ఇచ్చేవాటా ఎంత? మనకు న్యాయంగా రావలసిన వాటా రావడంలేదు. లెక్కల బట్టి చూస్తే ఇండియాలో 8 లక్షల ఎకరాలలో 2 లక్షల 25 వేల టన్నుల పొగాకు ఉత్పత్తి అవుతోంది. ఇందులో ఆంధ్ర రాష్ట్రాన్ని తీసుకుంటే 3 లక్షల 50 వేల ఎకరాలలో ఒక లక్ష టన్నుల పొగాకు ఉత్పత్తి అవుతోంది. అంటే, ఇండియాలో ఉత్పత్తి అయే పొగాకులో దాదాపు 40% ఆంధ్ర రాష్ట్రంలో ఉత్పత్తి అవుతోంది. ఇందులో వర్జీనియా పొగాకు అంటే మేలురకం సిగరెట్లు తయారుచేసే పొగాకు. ఇండియా మొత్తంమీద తయారయే దానిలో 95% ఒక్క గుంటూరు జిల్లాలోనే యీ వర్జీనియా పొగాకు తయారు అవుతున్నది అన్నారు. కృష్ణా, తూర్పు గోదావరి జిల్లాలను కలిపిచెప్పారు అనుకున్నా, భారత దేశము మొత్తం మీద ఈ వర్జీనియా పొగాకు నూటికి 95% ఆంధ్ర రాష్ట్రంలో తయారు అవుతున్నది. ఆ 40% మాత్రమే ఇతర రాష్ట్రాలలో తయారు అవుతున్నదని అనుకోవాలి ఇటువంటి పరిస్థితులలో 35 కోట్ల రూపాయిలు ఆంధ్రరాష్ట్రంనుంచి కేంద్ర ప్రభుత్వానికి Tobacco Excise Duty క్రింద వచ్చేపన్నులోనుంచి ఆంధ్ర రాష్ట్రంకు ఎంత వస్తోందో చూద్దాం. ఇదివరకు 18 కోట్లు రూపాయిలు వస్తున్నట్లు లెక్కలు వచ్చినాయి. Taxation Enquiry Committee Report తీసి అందులో ఉన్న లెక్కలు బట్టి ఆంధ్రరాష్ట్రంనుంచి ఎంత పోతున్నదో రాత్రి, ఉదయం లెక్కలు వేశాము. Excise పన్నులు కేంద్రానివి కాబట్టి వాటిని ఒక list రూపంలో ఇచ్చారు. వర్జీనియా పొగాకులో 95% ఆంధ్ర రాష్ట్రంలో తయారవుతోంది; ఇది మేలు రకం సిగరెట్లు తయారు చేయడానికి అవసరం. విదేశాలనుంచి మరికొంత తెచ్చుకున్నా ఉత్పత్తి పన్ను ఇక్కడదాని మీద వేస్తారు. ఇందులో అనేక grades ఉన్నాయి. ఈ విషయాలన్నీ గమనించి,

Sri P. Sundarayya] [4th October 1955

కేంద్ర ప్రభుత్వం ఏకీతిగా మన రాష్ట్రంనుంచి పన్నులు తీసుకు పోతోందో చూచి మనకు రావలసిన దానిని రాబట్టడానికి కృషిచేస్తారారని చెబుతున్నాను. Report లో page references ఇస్తాను. 298 పేజీలో unmanufactured tobacco, అంటే, ముడిపొగాకుమీద వేసే పన్నుల rates యిచ్చారు. మేలురకం సిగరెట్లమీద పన్నులు ఏరకంగా వేశారో ఇచ్చారు. 426, 427, 428 పేజీలలో appendices లో ఏరకం పన్నుకు ఎంతెంత వేయాలో జాబితా యిచ్చారు. ఈ లెక్కప్రకారం చూస్తే నాకువచ్చిన వివరాలు ఈరకంగా ఉన్నాయి. కేవలం మేలురకం పొగాకుకు cured tobacco అంటారు. 1953-54 లో వేసినపన్ను 2 కోట్ల 60 లక్షల పౌనులమీద 4 కోట్ల రూపాయల వరకు excise పన్నువేశారు. అందులో 95% ఆంధ్రరాష్ట్రంలోనుంచి వచ్చింది. కాబట్టి ఈ నాలుగుకోట్లు దాదాపు ఆంధ్రరాష్ట్రంనుంచే తీసుకున్నారని చెప్పక తప్పదు. మేలురకం సిగరెట్లు ఎన్నివేలు, కోట్లు తయారు చేశారో లెక్కలు ఇచ్చారు. దీనిమీద లెక్కలప్రకారం చూస్తే 4 కోట్లు 27 లక్షలు రూపాయిలు పన్ను వేశారు, మేలురకం సిగరెట్లు తయారుచేయాలంటే వర్జీనియాతప్ప మరొకరకం లేదు. ఇతర దేశాలనుంచి తెచ్చుకున్నది యిందులో లెక్కలోనికిరాదు. ఈ 4 కోట్ల 27 లక్షల రూపాయిలలోకూడా, లేదన్నా 3 కోట్ల రూపాయిలైనా ఆంధ్రరాష్ట్రం నుంచి తప్పకుండా వెళ్ళివుంటుంది. నాటుపొగాకు బీడీలుకోసము ఉపయోగించేది తీసుకుంటే 11 కోట్ల 60 లక్షల పౌనులు ఇండియాలో ఉపయోగించారు. ఇందులో 40% ఆంధ్రరాష్ట్రంలో వున్నదికాబట్టి వర్జీనియాపొగాకు తీసివేసి మిగిలినపొగాకులో 40% లెక్కవేస్తే 4 కోట్ల 60 లక్షల రూపాయలు మన ఆంధ్రరాష్ట్రంనుంచి బీడీలు కోసం పనికివస్తుందని excise officers అనుకున్న పొగాకుమీద పన్ను వచ్చింది. చుట్ట, ముక్కుపొడి, మిగిలిన రకాలు తీసుకొని 4 % చెప్పిన లెక్క వేస్తే ఆంధ్రరాష్ట్రంనుంచి మరొక 4 కోట్ల రూపాయిలు వచ్చినట్లు కన్పిస్తుంది. వర్జీనియా పొగాకుమీద వచ్చే 3 కోట్ల రూపాయిలు కలుపుకుంటే మొత్తం ఆంధ్ర రాష్ట్రంనుంచి 15, 16 కోట్లు రూపాయిల కంటే ఏమాత్రం తక్కువ రావడంలేదు. పోతుకువెళ్లితే 18 కోట్లుకూడా కావచ్చును. ఉజ్జాయింపు లెక్కల ప్రకారం చూచినా, 15, 16 కోట్లయినా తీసుకుని వెళ్లుతున్నారు. ఇందులో రైతులు తమ ఉపయోగానికి ఉంచుకునే పొగాకుమీద పన్ను వేసేదిలేదు. అది యిందులో చేరలేదు. ఆ ఆదాయంలో మనకువచ్చే వాటాఎంత? ఇందులో మనకు 40% రావాలి. ఆంధ్ర రాష్ట్రంలో ఎక్కువగా తయారై ఆదాయంవచ్చే పొగాకుమీద వచ్చే పన్నును వివిధ రాష్ట్రాలమధ్య పంచిన పద్ధతిఏమిటి? కేంద్రప్రభుత్వానికి పొగాకుమీద 35 కోట్ల రూపాయలు వస్తోంది. 3 కోట్ల రూపాయలు vegetable products మీద

వస్తోంది. 9 కోట్ల రూపాయలు అగ్గిపెట్టెలమీద వస్తుంది. ఈ మూడింటి మీద కేంద్రప్రభుత్వానికి 47 కోట్ల రూపాయలు వస్తుంది. ఇందులో ఆంధ్రరాష్ట్రం నుంచి 16 కోట్లకు తక్కువ కాకుండా వస్తుంది. ఈ ఆదాయంలో 60% కేంద్ర ప్రభుత్వం తీసుకుని 40% మాత్రం రాష్ట్రాలమధ్య జనాభా లెక్కల ప్రకారం పంచుతున్నారు. మొత్తం 104 కోట్ల రూపాయిలు Excise పన్నులు వసూలు చేస్తున్నప్పుడు గుడ్డలు, వగైరా వాటిమీద పన్నులు వేస్తున్నప్పుడు వాటిలో భాగం యివ్వడంలేదు. మన వస్తువులనుంచి పన్ను తీసుకువెళ్ళినప్పుడు ఇతరులతో భాగం పంచుతున్నారు. ఇతర రాష్ట్రాలలో గుడ్డలు, jute tea తయారై వాటిమీద పన్నులువచ్చే సందర్భంలో వాటిలో మనకు వాటా యివ్వకుండా, 47 కోట్ల రూపాయలలో మాత్రం వాటా యిస్తాము. 57 కోట్ల రూపాయలలో వాటా యివ్వముఅంటే ఏమిన్యాయం ? Excise పన్నులలో ఇంత అని తేల్చకుండా Income-tax విషయంలో 50% ఏవిధంగా పంచారో ఆ విధంగా మొత్తం Excise తీసుకుని 55%, 60% రాష్ట్రాలకు కావలసినరీతిగా జనాభా దామాషాను పంచితే అంగీకరించడానికి అభ్యంతరంలేదు. మన పొగాకునుంచి వాళ్లు తీసుకునివెళ్లితే, వాళ్ల tea నుంచి మనకు వస్తుంది అనుకోవచ్చు. దేశసంపదను యావత్తు రాష్ట్రాలకు జనాభానుబట్టి అవసరాలనుబట్టి పంచడంలో న్యాయంఉన్నది. ఒక రాష్ట్రంలో వచ్చేదానిని తీసుకుని మిగిలిన రాష్ట్రాలలో వచ్చేదానిని excise లోనికి తీసుకోకుండా దానిలో కొద్ది భాగం మాత్రమే పంచుతాం అని చెప్పడంలో మాత్రం అర్థంలేదు.

ఎక్కువవాటా అడగాలని నేను కోరుతున్నాను. ఈరీతిగ పన్నులు వసూలు చేసుకొని మనకు న్యాయమైనవాటా ఇవ్వడములేదు. Income-tax వసూలయితే తక్కువ ఖాతాయని మంత్రిగారు చెప్పవచ్చును. Bombay, Calcutta లో ఎక్కువగా ! దానిలో 100 కి 55 పాళ్లు రాష్ట్రాలకిచ్చినప్పుడు జనాభా ప్రకారము కావలసినదానికంటె ఎక్కువవస్తుందని చెప్తూఉన్నారు. అది నిజమే. దానిని పంచేటప్పుడు ఒక సూత్రముకూడ ఉన్నది. 100 కి 80 పాళ్లు జనాభానుబట్టి 20 పాళ్లు వసూలుచేసిన దామాషానుబట్టి పంచిపెడుతున్నారు. Excise tax లుకూడా 80% జనాభా దామాషాను 20% వసూలుమీద ఇవ్వలేదు, Special grant కూడా ఇవ్వడములేదు. Jute అదనంగా పండిస్తున్నది. అదనంగా పండిస్తున్నందుకు అస్సాము బెంగాలు ఒరిస్సా బిహారు రాష్ట్రాలకు ప్రత్యేక grant ఇస్తున్నారు. బెంగాలుకు 1½ కోట్లు ఒరిస్సాకు 75 లక్షలు అస్సాముకు 70, బీహారుకు 15 లక్షలు ఇస్తున్నారు. మనకు ప్రత్యేకముగ పొగాకు అదనంగా పండిస్తున్నందుకు ప్రత్యేక గ్రాంటు ఇవ్వలేదు. అది Constitution లో ఎక్కడ లేదన్నారు.

Sri P. Sundarayya] [4th October 1955

కాంగ్రెసు మంత్రివర్గము అక్కడఉంది. 3 పాళ్లు majority కూడ వారికక్కడ ఉంది. ఎందుకు ఈ గ్రాంటు విషయమయి ప్రయత్నము చేయలేదు. ఈ విధముగ మనవద్దనుంచి ఎక్కువపన్నులు తీసుకుంటున్నారు. ప్రణాళికలలో జనాభానుబట్టి ఆంధ్రరాష్ట్రంలో 2 కోట్ల 60 లక్షలుఉన్నారు. కాబట్టి 18 వ వంతు 129 కోట్ల కంటె ఎక్కువరాదని అంటున్నారు. బెంగాలులో 2 కోట్ల జనాభాకు అక్కడ 250 కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. అందుచేత ఈ రీతిగ కేంద్రప్రభుత్వము మన ప్రజలమీద రైతులమీద వేసేపన్నులు తీసుకొని న్యాయమైనవాటా మనకివ్వనంత కాలము అభివృద్ధి ప్రణాళికలకోసము డబ్బుకావలెను. పన్నులు ఎక్కువ చేస్తాముఅంటే మేము ఒప్పుకోము. మన ప్రజలుకూడ తయారుగా ఉంటారని నేను అనుకొనడములేదు. పన్నుల విషయములో మనకు రావలసినవాటా మనకువచ్చిందా అన్న విషయము తెలుసుకోకుండా మేము పన్నులు వేస్తామంటే అర్థములేదు. పన్నులు ఇవ్వకపోతే మీకు నందికొండ తుంగభద్ర ఎగువకాలువరాదు, ఎరువుల factory రాదు అని చెప్పడము న్యాయముకాదు. ఇది పుగాకుమీద పన్ను ఇది రైతులపుగాకు కొనేవారిమీద చిన్న చిన్న వర్తకులమీద పడకుండా ప్రభుత్వము ఏమి చర్య తీసుకుంటుంది? పెద్ద పెద్ద వర్తకులు I.L.T.D. లాంటి గుత్తమొనాపొలి కంపెనీలు ఈ పన్నులు భరించే ఏర్పాటుచేయవలెను. గుంటూరు రైతాంగము ఈ విషయములో చాలా ఆందోళన పడుతున్నారు. I. L. T. D. వారు రైతుల పొగాకు సరియైన గ్రేడింగు ఇవ్వడములేదు. అందుచేత మార్కెటింగ్ yard లను పెట్టించి న్యాయంగా గ్రేడింగు చేయించి దానిప్రకారము I.L.T.D. కంపెనీలాంటి పెద్ద వర్తకులు కొనే న్యాయమైన ధరలో రైతులకు ఇచ్చేటట్లు ప్రభుత్వము ఒక చట్టము చేసింది. కాని I. L. T. D. వారు ఈ మార్కెటింగ్ Yard లకు వచ్చే పొగాకు కొనమంటున్నారు. సరాసరి మా వద్దకువచ్చి మా గ్రేడింగును అంగీకరిస్తేనే కొంటాము లేకపోతే మేము కొనము అని అంటున్నారు. ప్రభుత్వము ఏమి చేయకుండా కూర్చుంది. రైతులకు వేరేగతిలేక I. L. T. D. కంపెనీవారి దగ్గరకువెళ్లి వారిచ్చిన గ్రేడింగు అంగీకరించి వారు నిర్ణయించిన ధరతో పొగాకు అమ్ముకోవలసి వస్తుంది. దీనిగురించి ప్రభుత్వము ఏమి చర్యతీసుకుంటుంది? మార్కెటులేదు అంటే సరికాదు. I.L.T.D. వారు గుత్త అధికారము తీసుకొని ధరలు మేనేజిచేసేటంత కాలము మనకు ధరలురావు. ఏ చైనామీదో England మీదో ఆధారపడితే ధరలురావు. మన పనికిమాలిన పొగాకు చైనా ఎల్లప్పుడు కొనదు. ఇంగ్లండు మన పొగాకు dumping ground కాదు. కాబట్టి మన రాష్ట్రంలోనే Cigarette factory లు పెట్టి వినియోగంచేసుకుంటే మంచిది. విదేశ మార్కెటులమీద ఆధారపడితే మన వర్తకులు రైతాంగము దివాళా తీయవలసివుంటుంది, గుంటూరు రైతులు

తాము Cigarette factory పెట్టుకుంటూ మన్న దానికి I. L. T. D. కంపెనీ పోటీలేకుండాచేసి Defence contract ఇప్పించాలని కోరుతున్నాను. I.L.T.D. కంపెనీకి గుత్త వ్యాపారము చేసుకునేందుకు వారి ఇష్టమొచ్చినధర నిర్ణయించడానికి హక్కువుంది. వారిమీద ప్రభుత్వము కుస్తీపట్టలేనట్లుంది. అలాంటప్పుడు అదనంగా ఈ పన్నులు ప్రజలమీద వేయడంలో న్యాయమేమిటని ప్రజలు అడుగుతున్నారు. చుట్టలు, బీడీలు, చార్‌మినార్, Scissors సిగరెట్లు త్రాగేవారిమీదే పడుతుంది. బీడీలమీదే పడుతుంది. బీడీలమీదకాని, సిగరెట్లమీద కాని 100 కి 3½ పన్ను వేసి నా ధరలు పెరగకుండా చూస్తామన్నారు. సంజీవయ్యగారు consumers కు దెబ్బ లేదన్నారు. Select committee లో ధర పెరుగదుకదా, ధనవంతులమీద పన్ను పడితే ఏమని ఊరుకున్నాము. తరువాతచూస్తే 1½ అణా అమ్మేది అప్పుడే 0-1-9 అమ్ముతున్నారు. రేపు 2 అణాలు అయితేగూడ మనమేమి చేయలేము. కేవలము మన రాష్ట్రంలో బీడీ తాగేవారిమీదకాని ఖరీదు లోపు సిగరెట్లు త్రాగేవారిమీద పడుతున్నది. 100 కి 3½ వేస్తాము అని అన్నారు. Charminar తీసుకుంటే 10 సిగరెట్లకు 2½ పెంచవచ్చును. ఇప్పుడు 0-1-6 అమ్ముతుంది. ఈ 0-1-0 పెరగకుండ ప్రభుత్వము ఏమిచర్య తీసుకుంటుంది ? మంత్రిగారు హామీ ఇస్తామన్నారు. వారి హామీకి ఏమి విలువవుంది ? ధరలు పెరగకుండ తయారు అవుతారా ? సంతోషంతో బలపరుస్తాము. ఈ పన్ను రైతులమీదపడదు కొనుక్కునే dealers మీదనే పడుతుందన్నారు. కాని పొగాకు ప్రతినిధులు ఏమిచెప్పారు ? వర్తకులదృష్టితో జాలయ్యగారుకూడా చెప్పారు. పన్ను విషయము మాట్లాడేవారు కాంగ్రెసు రైతులు కాబట్టి మా పార్టీ నిర్ణయముచేసింది, ఇది ఆఖరురోజు టైమయిపోయింది, తిరగదోడటానికి వీలులేదంటున్నారు. రైతులమీద ఈ పన్ను పడదు అనే భ్రమలేదు. Co-operative Society పెట్టించి marketting facilities ఇప్పించాలని రైతులు కోరుతున్నారు.

ఇది వర్తకులమీద పడదా అని అంటున్నారు. వర్తకులమీద పడుతుంది. పడదని జాలయ్యగారు తల ఊపుతున్నారు. జాలయ్యగారు పెద్ద వ్యాపారస్థులు కాబట్టి వారిమీద పడకపోవచ్చును. Sales Tax ఏ రీతిగా అమలు జరుగుతోందో చూచినట్లయితే తెలుస్తుంది. Consumers మీద వెయ్యకూడదు. ధరలు పెరగనివ్వకూడదన్నారు. మామూలు Charminar సిగరెట్లుగాని, ఇంకో రకపు సిగరెట్లుగాని బీడీలుకాని, చుట్టలుకాని, ముక్కుపొడికాని, వీటికిధర పెంచకూడదన్నారు. పదివేల రూపాయిలు లోపు వ్యాపారం చేసుకునేటటువంటి వర్తకులు Sales Tax Bill వ్రాయనవసరంలేదు. అందుచేత వాళ్ళమీద పడదు. ఇంక చిన్నవర్తకులమీద ఏ రీతిగా పడుతుంది అది తేలికగా నడుస్తోందో చూస్తే. 50 వేలో, లక్షో, పదిలక్షలో

Sri P. Sundarayya] [4th October 1955

పెట్టి వ్యాపారంచేసేటటువంటి టొకు వ్యాపారస్థుడి దగ్గర నుంచే దీన్ని వసూలు చేస్తున్నాం. ఇంతపుగాకు, ఇన్ని బీడీలు, ముక్కుపొడి, ఇంక నమిలే పుగాకు వీటి మీద నూటికి మూడుంపరక చొప్పున వేస్తున్నారు. అతడు ఏమి చేస్తాడు? తన దగ్గరకొనే చిల్లర వ్యాపారస్థులమీద ఆ పన్ను వేయడానికి అతనికి హక్కున్నది. ఆ చట్టం ప్రకారం పన్ను వేసితీరాలి. నూరు రూపాయిల పుగాకు అమ్మి మూడుంపరక Sales Tax అని బిల్లు వ్రాసి ఇస్తాడు. ఇది ప్రజలమీద తోసేదానికి వీలు లేదంటున్నారు. ఈ మూడుం పరక ఈ చిన్న వర్తకుడు ఏమి చెయ్యాలి? తానైనా భరించాలి. తాను భరిస్తే నష్టపడవలసియుంటుంది. తనకు వచ్చే లాభంలో నుంచి ఇచ్చుకోవాలి. అందువల్ల ఈ పెద్ద టోకు వ్యాపారస్థులకు, ఈ పన్నుకు వాళ్ళకేమీ అభ్యంతరంలేదు. వాళ్ళే ప్రభుత్వంయొక్క ఏజంట్ల క్రింద వసూలు చేస్తారు. రెండు పుస్తకాలు పెట్టి వాళ్ళ దగ్గరనుంచి వసూలు చేసేటప్పుడు మూడుంపరక తీసుకుంటారు. వాళ్లు ఇచ్చుకోవలసి వచ్చేటప్పటికి మేము అమ్మలేదని ఇంకో లెక్క చూపుతారు. టోకు వ్యాపారస్థులకు ఇది లాభసాటి బేరంగానే ఉంటుంది కాని, నష్టకరంకాదని స్పష్టంగా తెలుస్తోంది. కాని చిల్లరవ్యాపారస్థుల సంగతి ఏమిటి? ఇది వాళ్ళకు తప్పకుండా affect అవుతుంది. ఇక రైతాంగం ఏమి చెబుతున్నారంటే తమ దగ్గర కొనే ఏ I.L.T.D. కంపెనీ ఏజంటో, ఇంకొక కంపెనీ ఏజంటో వచ్చి కొనే టప్పుడుఇదివరకు పుట్టి 50 రూపాయిలకు కొనేది, ఇప్పుడు 450కో ఇంకొంతతక్కువకో ఇస్తేనే కొంటామంటున్నారు. మిగతాది మాకు tax ల క్రింద పోతోంది అంటారు. ప్రభుత్వం grades నిర్ణయించి, రైతుకు ఇంత ధరకు ఇచ్చి తీరాలి లేకపోతే మీ కంపెనీ మేము స్వాదీనం చేసుకుని nationalise చేస్తాం అని ఒక చట్టం తీసుకువస్తారా? రైతుకు ఇంత ధర ఇస్తామని చెప్పి గ్యారంటి చెయ్యడానికి చట్టం తీసుకురావడానికి మీరు తయారుగాలేరు. రైతుమీద పడకుండా చూస్తామని గాని, లేకుంటే వాళ్ళకు గిట్టుబాటయ్యే ధరకు ఇవ్వడానికి వీలుగా ఒక చట్టం తెస్తున్నామని మంత్రి సంజీవయ్యగారు హామీ ఇచ్చినట్లయితే నేను సంతోషంగా అంగీకరిస్తాను. అప్పుడు మీరు 0-7-3 కాదు, 0-7-6 వేసుకున్నా నాకేమీ అభ్యంతరంలేదు. ఆ పద్ధతి సూచిస్తూ నేను ఒక సవరణకూడా ఇచ్చాను. మీరు purchaser అన్నప్పుడు first purchase అంటే ఏమిటో నిర్ణయించండి. పెద్ద manufacturer లేక exporter అన్నప్పుడు exporter అనేపదం Constitution రీత్యా ఏమైనా అభ్యంతరంవస్తే dealer అని చెప్పండి. నాకేమీ అభ్యంతరంలేదు. అది రైతులమీద పడకుండా వాళ్ళే ఇచ్చుకొనేటట్లు తగిన చర్యలు తీసుకోమని చేస్తే నా సవరణ 7½ పైసా కాదు. అణావేసినా సమ్మతమే. ఈ I.L.T.D. కంపెనీ ఎన్నో కోట్ల రూపాయిలు మనదేశంనుంచి లాభాలు ఆర్జిస్తూ

ఉందో దానికి లెక్కలూ, పక్కలూ ఏమీలేవు. ఎందుచేతంటే పూది England లో Registered Company, అందుచేత ఇక్కడ accounts చెప్పవలసిన అవసరం లేదంటున్నారు. ఈమధ్య పార్లమెంటులో కొన్ని చట్టాలు చేశారు. దాన్నిబట్టి అయినా ఈ accounts ను బైటకు తీసుకురాగల్గుతారేమోగాని, ఇంతవరకూ ఈ I.L.T.D. కంపెనీ ప్రతిసంవత్సరం మన ఆంధ్ర దేశంనుంచి ఎంత లాభం గడిస్తోందో ఆ లెక్కలు మనకు చూపించడంలేదు. ఈ పొగాకు మీద ఎంత దారుణంగా పన్నులు వేస్తూ ఉన్నారో ఈశాసన సభ దృష్టికీ, మీదృష్టికీ, ప్రజల దృష్టికీ తీసుకురాదలచుకున్నాను. ముందు వర్జీనియా పొగాకు సంగతి తీసుకుంటాను. ఇక్కడ పండించినటువంటి వర్జీనియా పొగాకు ఇతర దేశాలనుంచి వచ్చిన ఎటువంటి పొగాకునుకూడా కలపకుండా–blending అంటారు–మేలి రకమైనటువంటి చుట్టలు, సిగరేట్లు, తయారుచేసే దానికి పనికి వస్తుంది. అందువల్ల దానిమీద పౌనుకు రూపాయివేస్తూ ఉన్నారు. కాని ఈ Gold Flake ఇంకా ఉన్నత తరగతి సిగరెట్లకోసం విదేశాల నుంచి వచ్చిన పొగాకుతో blend చేస్తే పౌనుకు 7-8-0 కూడా వెయ్యవచ్చు. ఒక పౌను వర్జీనియా పొగాకును, flue cured, Charminor సిగరెట్లు అటువంటివి చేస్తే కనీసం రూపాయి, గరిష్ట పక్షాన 7-8-0 వేసేదానికి ఉంది. విదేశాలనుంచి వచ్చిన దానితో blending చేసి సిగరెట్లకు పనికివచ్చే మేలురకం పొగాకుగా మారిస్తే దానికి 7-8-0 వేయవచ్చు. Virginia మొదటి grade పొగాకుకు 7-8-0 వేసేదానికి వీలుంది. ఇంకమధ్యరకం grade పొగాకుపుట్టి 400, 500 రూపాయిలుఖరీదుచేసేటటువంటి packet 5 అణాలు, 6 అణాలు ఖరీదుచేసే సిజర్సు వగైరా సిగరెట్లకు పనికివచ్చేటటువంటి దానిమీద 3-12-0 నుంచి 5-0-0 వరకూ, కేవలం పొగాకుమీదనే పన్నువేయడానికి వీలుంది. ఈ పన్నుమాత్రమే వేసి, సంతృప్తిపడ్డారా కేంద్ర ప్రభుత్వం అంటే అదికాదు. ఆ పొగాకు సిగరెట్లుగా మారిస్తే, సిగరెట్లుగా మారినతరువాత మరల ఇంకొకపన్ను వేస్తున్నారు. ఈ సిగరెట్లమీదవేసే central excise పన్ను ఎంత ఎక్కువగా ఉందంటే, వెయ్యి సిగరెట్లు 30 రూపాయలు 40 రూపాయలు ఖరీదుచేసే సిగరెట్లు అంటే packet 5 అణాలు, ఆరణాలు ఖరీదు చేసే సిగరెట్లకు ప్రతి వెయ్యి సిగరెట్లమీదా అదనంగా 7-8-0 పన్ను వేస్తున్నారు. తక్కువరకం Charminar వగైరా సిగరెట్లమీద, వెయ్యింటికీ 1-8-0 పన్ను వేస్తున్నారు. నేను సిగరెట్లు త్రాగడం అలవాటు లేకపోయినా, ఈ లెక్కలన్నీ సిగరెట్లు త్రాగే వాళ్లందరిదగ్గరకూ వెళ్ళి సేకరించాను. సిగరెట్టుబరువు ఎంత, చుట్టబరువు ఎంత అని లెక్కలు చూస్తే, ఒకపౌను పొగాకు వెయ్యిసిగరెట్లకన్న ఎక్కువరాదు. కాగితం బరువు మినహాయించి, packet బరువు మినహాయించి కేవలం సిగరెట్టులోవున్న పొగాకు బరువు మాత్రమే చూచుకున్నట్లయితే ఒకపౌను పొగాకు, వెయ్యిసిగరెట్లు చెయ్య

SRI P. Sundarayya] [4th October 1955

డానికి మాత్రమే సరిపోతుంది. దానిమీద ఎంతపన్ను వేస్తున్నారో చూడండి. తక్కువరకం Charminar లాంటి సిగరెట్ల విషయమై లెక్కలుచూస్తే పౌను ముడి పొగాకుమీద 1-0-0 పన్ను; వెయ్యి సిగరెట్లమీద 1-8-0 పన్ను, మొత్తం Excise 2-8-0. ఇంకా మన రాష్ట్రప్రభుత్వం Sales Tax వేయబోతోంది. 100 రూపాయలకూ 3-8-0, లేక రూపాయికిఅర్ధణాకదా మేమువేసేది, అంటారు. పౌనుపొగాకుమీద 0-5-0 Sales Tax పడుతుంది అంటున్నారు. మొత్తంపౌనుకు 2-13-0, టోకుమీద ఒకపౌను పొగాకుమీద రు. 3 లు. ఇది తక్కువరకం పుగాకు మీద. Taxation Enquiry Committee అర్ధరూపాయికన్న దానిఖరీదు ఏ పరిస్థితులలోకూడా ఎక్కువ ఉండదని చెప్పింది. దానిఖరీదంతా రైతుకిచ్చేసినా కూడా, ఇంకా మధ్యవర్తులున్నారు. రైతుదగ్గరనుంచి పౌను అర్ధరూపాయికో, ఆరణాలకో కొన్న పొగాకు ఈ రూపాంతరాలన్నీ పొంది ఈ పన్నుల గండాలన్నీ దాటి ప్రజలదగ్గరకు వచ్చేసరికి మూడు రూపాయలవుతోంది. మంత్రిగారు నాటుపుగాకు మినహాయించాము, పన్ను వేయడంలేదని చెప్పారు. కొంతవరకూ సంతోషమే కాని బీడీలు, చుట్టలూ, ముక్కుపొడి, నమిలేపొగాకు వీటిమీద మూడుంపరక చొప్పున మళ్ళీ పన్నువేస్తున్నారు. బీడీలకు ఉపయోగించే నాటుపొగాకు ఖరీదు 0-8-0 కేంద్ర ప్రభుత్వ పన్ను పౌనుకు 0-14-0 బీడీలమీద Central Excise కేంద్రప్రభుత్వం వెయ్యలేదు. మిమ్మలనుచూచి వాళ్లుకూడా అవలంబిస్తారేమో. అప్పుడు ఇంకాఎక్కువ పడుతుంది.

ఆ పన్నుకూడ మనస్సులో పెట్టుకున్నపుడు వారికిఅయ్యేది ఎంత ? బీడీలకు ఉపయోగించే నాటుపొగాకు ఖరీదు 0-8-0. అయినట్లయితే కేంద్ర ప్రభుత్వం పౌనుకు 0-14-0 అణాలు వేస్తున్నది. బీడిమీద వాండ్లు వేయలేదు. మిమ్ములనుచూచి వాండ్లుకూడా అవలంభిస్తారేమో తెలియదు. మీరు Sales Tax, వేస్తే మేముమాత్రం ఉత్పత్తిపన్ను బీడీలమీద ఎందుకు వేయకూడదు అనిచెప్పి Central Excise వేస్తే దానిమీద యింకా పడుతుంది. ఈరోజులేదు. తర్వాత ఈ పౌనుపొగాకుమీద, బీడీలమీద Sales Tax ఎంత పడుతుంది? ప్రభుత్వం యీ బిల్లుతెస్తే ఎంతపడుతుందో ప్రభుత్వం గుర్తించాల్సి ఉంటుంది. నేనేమో ఒకపౌనుకు 5 వేల బీడీలు అని చెప్పివేశాను. అంతకన్నా తక్కువకావచ్చును. ఎక్కువ కావచ్చును. బీడీలలో అనుభవంవున్న వాండ్లుగాని మంత్రిగారు తన department ద్వారాగాని తెలుసుకోవలసి వుంటుంది, 5 వేలు అవుతుంది. అయిదువేలు అన్నపుడు, 25 కట్ట 2 అణాలచొప్పున, 100 0-8-0 చొప్పున, 1000 5-0-0 లు చొప్పున 5 వేలు 25-0-0 లు అవుతుంది. ఇంకా కొంచెము చిల్లరగాకూడా తీసుకొంటే 31-0-0 లు దాని ఖరీదుఅయితే రూపాయకు ½ అణాచొప్పున వేసినపుడు

31 అరఅణాలు అంటే రెండురూపాయలు పన్ను వేస్తున్నా రన్నమాట. అంటే బీడీలకోసం ఉపయోగించే టటువంటి పొగాకుమీద కేంద్రప్రభుత్వం వేసే 14అణాలు కాక మన ఆంధ్రప్రభుత్వం Sales Tax క్రింద మరొక రు. 2 లు వేయబోతుంది. అంటే దీనికికూడా మరి ఒక రు. 3 లు చొప్పున పడుతుందన్నమాట. ఇక చుట్టలు విషయం చూడండి. చుట్టపొగాకుమీద కేంద్రప్రభుత్వం ఆరుఅణాలు వేస్తున్నది. వాండ్లు ఏమంటే sales tax 2½ అణాలు పడుతుంది. అర్ధరూపాయ అవుతుం దన్నమాట. ఇక మేలురకము పొగాకుసంగతి చూచుకొందాము అంటే Virginia పుగాకుఅనే మేలురకం పొగాకు సిగరెట్టుక్రింద తయారు చేసేదానికి చూచుకొన్న పుడు దానిఖరీదు రూపాయ అయితే కేంద్రప్రభుత్వం రు. 7½ చొప్పున పన్ను వేస్తుంది. మళ్ళీ సిగరెట్లు అది 30, 40 రు. లకు లోపల 1000 కి 30, 40 రు. లు చేసేది కాబట్టి మరొక రు. 7½ లు దానిమీద పడుతుంది. సిగరెట్లమీద Excise పన్ను అని ఈరోజు మన ప్రభుత్వం sales tax క్రింద 20% of the turnover, 30, 40 రూపాయలు పౌనుకి 1000 సిగరెట్లు అనిచెప్పి లెక్క వేసుకున్నపుడు, 30, 40 రూపాయలు దానిఖరీదు అవుతుందనిచెప్పి 1000 సిగరెట్లకి తే రు. 34 లు ఖరీదు అవుతుందని వేసుకున్నప్పుడు దానిలో 20% అంటే Sales Tax క్రింద వేయబడుతున్నది. ఇదివరకు వేస్తూఉండినారు. దానిఅర్థం ఏమిటి ? మేలురకం సిగరెట్ల కోసం ఉపయోగిస్తే రు. 23 లు పన్ను వేస్తున్నారు. ఒకరూపాయ Virginia పొగాకు, సిగరెట్లరూపంగా, (Gold Flake కాదు; మామూలు Scissors ఇటువంటివి ఈ ధరలలో ఉండేవి వచ్చేటప్పటికి రు. 23 లు పన్ను వేస్తున్నారు. ఈపన్ను ఎంత దారుణంగా వున్నది? కేవలం ఇట్లు రూపాయతో కాకుండా ఎకరంమీద ఎంతపడుతుంది ? ఎందుకంటే సిగరెట్లలోగాని, చుట్టలలో గాని, బీడీలలోగాని ఇంకా ఏది వేసినాకూడ, పొగాకు ప్రధానమైనది. కాగితం చుట్టడం ఇవన్నీకూడ చాల తక్కువ పని. ప్రధానమైన ఖరీదు అయ్యేది అంతాకూడా పొగాకు ఒకటే. అందుచేత నిజంగా పొగాకు మీద ఎంత దారుణమయిన పన్ను వేస్తున్నారంటే యీ Government వారు ఇచ్చిన లెక్కలనుబట్టే ఒక ఎకరంలో సామాన్యంగా సగటున భారతదేశానికి అంతకు చూచుకున్నపుడు, మన ఆంధ్రరాష్ట్రనికి కొంత ఎక్కువ పండుతుందను కోండి. 750 పౌనులనుంచి 1000 పౌనులవరకు పండుతుంది, నాటుపొగాకుగాని Virginia పొగాకుగాని ఎకరానికి హెచ్చుతక్కువలు ఉండవచ్చును. ఎకరాకు 1000 పౌనులు పండుతుందంటే, తక్కువపపంటే దానిని తీసిపారవేసి, ఎక్కువ పంటేవాటిని తీసుకోండి. ఎకరాకు 1000 పౌనులు తయారు అవుతుంది అను కొంటే దానిమీద ఈ పన్నులప్రకారం వేసినట్లయితే ఎకరాఖరీదుమీద, అది

రైతు ఇచ్చుకొంటున్నాడని నేను అనడంలేదుగాని, ఎన్ని వేలు పన్ను వేస్తూ ఉన్నారో, మీరు చూచుకున్నప్పుడు, అది కేవలం చుట్ట, ముక్కుపొడి ఇటువంటివి అయినట్లయితే అయిదువందల రూపాయలు పడుతూవుంది. తక్కువ రకమైన బీడీలు సిగరెట్లు అయితే మూడువేలు అవుతుంది. మేలురకమైన సిగరెట్లుఅయితే 23వేల రూపాయలు అవుతుంది. అందుచేత నిజమే. మనమందరము సంతోషించవలసిందే. మన ఆంధ్ర దేశముయొక్క స్వర్ణభూమి ఒక ఎకరానికి 23 వేల రూపాయల పన్ను మాత్రమే ఇచ్చుకోగలిగినటువంటి పంటను పండిస్తుందంటే మనం నిండుగా "వినుడు, వినుడు" అనిచెప్పి సంతోషంగా ధ్యానాలు చేయడం చాల సంతోషమే. నాకేమి అభ్యంతరంలేదు. మన ఆంధ్ర దేశంయొక్క రత్నగర్భం భారతదేశంయొక్క రత్నగర్భం ఎటువంటిదో కనబడుతున్నది. కేవలం ఇది 23 వేల రూపాయల పన్నులసంగతి నేను చెప్పాను. దీంట్లో ఇతరకూలీలు పనిచేసి, ఫాక్టరీయజమానులు పనిచేసి, వచ్చే ఆదాయాలకు లెక్కలేదు. కేవలం పన్నుల రూపమున కనీసం ఒక ఎకరంలో పండే పొగాకుమీద, తక్కువ ఏమిపన్ను లేదనుకొన్నటువంటి చుట్ట వీటికి, 5 వందలనుంచి మామూలు బీడీలు వీటికి, 1000, 3000 రూపాయలవరకు వెళ్లి, మేలురకం సిగరెట్ల వరకు 23 వేల రూపాయలదాకా పన్ను వేస్తున్నట్లయితే, మరల ప్రభుత్వం వరకు మేముపన్ను వీటిమీద చాలతక్కువవేస్తున్నాము అంటుంది. వాటిమీద వేసేదానికి నాకు అభ్యంతరంలేదు. బీదలమీద పడకుండా, ధనవంతులమీద పడేటట్లుగా, I. L. T. D, Company మీద, పెద్ద పెద్ద వ్యాపారస్థులమీద పడేటట్లుగా వేస్తే మాకేమి అభ్యంతరంలేదు. అది చేయరు. ఈరీతిగా పన్ను వేయడం అనేదే వస్తున్నది. అందుచేతనే మేము దీనిని వ్యతిరేకించకతప్పదు. తర్వాత మేముచెప్పేది ఏమంటే వారివెనుకాల 170 మంది సభ్యులు ఉన్నారు. మేము చెప్పేవాదనకుకూడ, పెద్దవిలువ ఉండదనే సంగతి, ఈ 5, 6 నెలల అనుభవంలోనే బాగా కనబడిందనుకోండి. అయినా ఇకముందు తెచ్చేబిల్లులకైనా కొంత ఆలోచించి, ఏదో పనులు ఉన్నాయి కొబట్టి త్వరత్వరగా పన్ను వేసినపద్ధతి గాకుండాను, ఎంతెంతపడుతూఉంది? దీనికి న్యాయం ఎక్కడఉంటుంది? ఈరీతిగ మనం ఇష్టంవచ్చినట్లుగా పన్నులు వేసుకొనిపోవడమేనా? ధనవంతులమీద, ఆదాయాలు వచ్చేవాండ్లమీద, factory యజమానులమీద I. L. T. D Company మీద పన్నులువేయడానికి ఎందుకని ఆలోచించకూడదు? ఎందుకు చట్టాలు తీసుకొనిరాకూడదు? అని ఒక పర్యాయం జాగ్రత్తగ ఆలోచించవలసినది. అంతేకాకుండా మంత్రివర్గం ఆ మధ్య అనేకసమాధానాలు చెప్పారు. తొందరపడకండి. Betterment లెవీకాదు. పొగాకుపన్నులేకాదు. ఈ Sales టాక్సేకాదు. నీటిపన్నులే [illegible] భూమియొక్క అదనపుశిస్తేకాదు. భూమిలో ఏమిపంట వేస్తామో ఆ పంటను

బట్టి మళ్లీ మేము ఇంకొకచట్టం తీసుకొని రాబోతున్నాము. ఇప్పటికి ఎకరంలో పండేటటువంటి పొగాకుకు 23 వేల రూపాయలు వేస్తున్నారు. ఇంకా మీరు ఎన్ని పన్నులు తెచ్చివేస్తారో దానిమీద చూడండి. ఈరీతిగా మీరు పన్నులు వేసుకుంటూ పోతూఉన్నట్లయితే ఆఖరుకు బంగారుబాతు గుడ్లుపెట్టిన సామెత అవుతుందనే సంగతిమాత్రం మీరు మరచిపోతే అదేమి ఉపయోగంఉండదు. అందుచేత ఆలోచించండి. ఎక్కడ పన్నులు వేయాల్సిఉంటుందో అక్కడ వేయండి. అందుచేత ఈ బిల్లుకు నేను రెండు సవరణలు ఇచ్చాను. ఒకటి ఏమి టంటే, ఈ చిన్న చిన్న బీడీలు, చుట్టలు, వీటిమీద పన్నులువేయము అని మంత్రి గారే ఒకరోజు చెప్పారు. ఇపుడు ఏమంటారో తెలియదు. వీటి అన్నిటిమీద బీడీలు, చుట్టలమీద (31/8) మూడుంపరక పన్నువేస్తే మాకువచ్చేది రెండులక్షల రూపాయలకన్నా ఎక్కువరాదని చెప్పారు. ఈ రెండులక్షలకోసం, దేశం అంతా కూడాను మిమ్ములను అవవసరంగా విమర్శించేందుకోసం, రెండు కోట్లమంది చుట్టలు త్రాగడంలేదు. మనదేశంయొక్క అదృష్టవశాత్తు 2 లక్షలకోసం బీదలమీద పన్ను వేయకుండా నాటుపొగాకును మినహాయించినట్లే బాగుంటుంది. వాటిని మినహా యించవలసిందే. Virginia మీదవేశారు. వేసినదానికి నేను ఒక సవరణ ఇచ్చాను. ఆ సవరణ ఏమిటంటే, మీరు Purchase tax అంటూ ఉన్నారు. కొని కొన్నటు వంటి వర్తకునిమీద, లేక పెద్ద Manufacturer మీద పడేటట్లుగా, రైతుమీద దానిని తోసివేయకుండా, మీరు దానికి తగినరీతిగాచేయండి. మీకు చట్టంలో అధి కారంఉంది. వీటిని అమలు జరిపేదానికోసం ఎటువంటి చిక్కులువచ్చినా, ఎటు వంటికష్టాలువచ్చినా, మాకు తొలగించేదానికి హక్కుఉందనిచెప్పి ప్రతిక్లాసులోను ప్రతి Act లోను మీరు పెట్టుకొంటున్నారు. అందుచేత ఇదిరైతుమీద పడకుండాను, ఈ పెద్ద పెద్ద వ్యాపారస్థులు, Manufacturers కొన్న దగ్గరనే వసూలుచేసేటట్లు మీరు తగినరూల్సు చేయవచ్చును. అందుచేత ఆ రెండో సవరణపెట్టాను.

అది మేము ఎట్లా చేయగలమంటారేమో! దానికి మార్గాలు మీ రూల్సులో చేయడానికి వీలులేకపోతే, కొత్త చట్టాలు తీసుకురాండి. పొగాకు రైతుకు ధర guarantee చేసే చట్టాలు తీసుకురాండి. ఈ రకమైన బీడీలకు, ఈ రకమైన సిగ రెట్లకు, వీటిని ఇంతకంటె ఎక్కువధరకు అమ్మకూడదు, కొనకూడదు అని పెట్టండి. ఈ రీతిగా చేయకుండా ఏదో డబ్బు తేలికగా వసూలుచేసుకొనే మార్గం ఉన్నదని ఈ రీతిగా పన్నులు వసూలు చేయడంమాత్రం న్యాయంకాదని చెబుతూ ముగిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, శ్రీ సుందరయ్యగారు చాలా విలువగలిగినటువంటి ఉపన్యాసము చేశారు. ఒక ఎకరాకు రు. 23 వేలు పన్ను పడుతూందని చెప్పారు. బహుశా వారి ఉపన్యాసముకూడ రు. 23 వేల కంటె ఎక్కువ అవుతుందనే నా అంచనా. కాని యీ రు. 23 వేల శిస్తు చాలా భాగ్యవంతులు త్రాగేటటువంటి cigarettes కు ఉపయోగించే పొగాకు మీద పడుతుంది. కాబట్టి వారికి ఆక్షేపణ లేదనుకుంటాను. మూడువేలరూపాయలు పన్ను భరించేటటువంటి Charminor Cigarettes కంటె తక్కువ విధించబడేటటువంటి బీడీలు వగైరాలు బీదలు త్రాగుతారనే వాదన ఉన్నది. కాని ఇప్పుడు ఇంగ్లాండులో ఈ పొగాకుమీదవేసే పన్నును చూచినట్లయితే బహుశా ఒక ఎకరాకు ఏ లక్షలో లేక యింకా ఎక్కువ పడుతుందేమో అనిపిస్తుంది. ఈ సందర్భంలో నేను ఒక్కటే అడుగదలచుకొన్నాను. ఈ Central Excise రు. 7½ లు విధించినప్పటినుంచి ఈనాటివరకు గుంటూరుజిల్లాలో గాని, ఆంధ్రదేశములో మరే ప్రాంతములోగాని పుగాకుపండించే ఎకరాలు ఏమైనా తగ్గినాయా, లేక పుగాకు క్రింద రైతుకు వచ్చేటటువంటి నికరాదాయం ఏమైనా తగ్గిందా ? ఈ రెండువిషయాలు ఆలోచించినప్పుడు, బహుశా దినదినానికి ఇంకా ఇతర జిల్లాలలోను, ఇతర తాలూకాలలోనుకూడ పొగాకుక్రింద సాగుబడి ఎక్కువ అవుతుందనుకుంటాను. ఒక్కొక్కసారి market లో fluctuations ఉంటే ఉండవచ్చునేమో కాని ఈ Central Excise వల్లగాని, sales tax వల్లగాని రైతులకు వచ్చేటటువంటి నికరఆదాయము తగ్గలేదనుకొంటాను. అందువల్ల శ్రీ నాగేశ్వరరావు మొదలగు వారు చెప్పినట్లు, తప్పకుండా రైతులకు గడచిన మూడుసంవత్సరాలు, అయిదు సంవత్సరాలలో ఎంత నికరాదాయము వచ్చింది ; ఈ పన్ను వేసిన తరువాత వారికి ఏదైనా తగ్గిందా ; I. L. T. D. కంపెనీవాళ్లు వీళ్ళ prices ఏమైనా cut చేశారా ; ఈ విషయాలన్నీ సమీక్షచేస్తాము. అవసరమైతే, ఈపన్ను తగ్గించడమో లేకపోతే మార్పుచేయడమో మేము ఆలోచిస్తాము అనేటటువంటి హామి వారికి యిస్తున్నాము. ఈ Marketing Officers Agricultural Officers వీరందరు కూడా వున్నారు. వీరందరిద్వారా పరిశీలన చేయిస్తాము. ఈసంవత్సరం ఈపన్ను విధించిన తరువాత పుగాకుపండించే ఎకరాలలో ఏమైనా తగ్గిందా, వారిలాభమేమైనా తగ్గిందా, ఈ విషయాలన్నీ తప్పకుండా మేము review చేసి అవసరమైతే వాళ్ళకు relief ఇవ్వడానికి తయారుగా వున్నామని చెప్పుతున్నాను.

తరువాత సుందరయ్యగారు, ఆంధ్రదేశములోనుంచి దాదాపు. 16, 17 కోట్ల రూపాయలుపొగాకుమీద Central Excise మూలంగా పోతూవుంటే, ఈప్రభుత్వం [illegible] కృషిచేసినారని అన్నారు. ఇది చాలా పెద్దవిషయము. ఈ విషయంలో యితర

4th October 1955] [Sri B. Gopala Reddi

రాష్ట్రములలో ఏమి జరుగుతున్నదనికూడ మనము సమీక్ష చేసుకొనవలసి యున్నది. ఇదే విధముగా jute growing ప్రాంతాలైనటువంటి అస్సాము, బెంగాల్ మొదలైనటువంటి ప్రాంతాలు 1937 సంవత్సరం నుంచికూడా, ఈ jute మీద మీరింత tax వసూలు చేస్తున్నారు, (customs మీద) కాని మాకు మీరు ఏమి ఇవ్వడంలేదని Finance Commission వచ్చినప్పుడల్లా, ప్రతిసారి పెద్ద ఆందోళనచేస్తూ వచ్చారు. అదేకాదు. చాలావరకు Income tax అంతాకూడా, బొంబాయిలోను, బెంగాల్ లోను, కలకత్తాలోను వసూలు చేస్తున్నారు. కాని మీరు మాకిచ్చేది చాలా తక్కువగాఉన్నది కాబట్టి కేవలం జనాభాబట్టి కాకుండా Income tax ఎక్కడైతే ఎక్కువో వసూలు చేస్తున్నారో దాన్నికూడ మీరు గమనించి మాయొక్క దామాషా ఎక్కువ చేయండని బొంబాయి, కలకత్తా వగైరా ప్రాంతాలు చాలారోజులనుంచి ఆందోళన చేస్తున్నారు. ఈ పన్నులు కేంద్రానికి రాష్ట్రానికి విభజనచేసేటప్పుడు ఇలాంటి తగాదాలన్నివస్తాయి. Jute growing ప్రాంతాలేకాదు. Tea ఎక్కడైతే ఉత్పత్తి అవుతున్నదో, అదంతాకూడా విదేశాలకు పోతున్నది. దానిమీద export duty చాలా ఎక్కువేస్తున్నారు. అది ఏమవుతున్నది ? అదేవిధంగానే అస్సాము నుంచి చాలా petrol వస్తున్నది. దానిమీద export duty లేక excise duty వేస్తున్నారు. కాబట్టి ఇదంతా కేవలం అస్సాముకే పోవలెనా ? దాదాపు 18, 19 సంవత్సరములనుండి ఈ తగాదా వస్తున్నది. నాకుతెలుసు. అంతకుముందు కూడ western awards అని వచ్చినప్పుడు provincial government అన్ని కేంద్రప్రభుత్వానికి contribute చేయాలని అన్నప్పటినుంచి బెంగాల్ వగైరా లంతాకూడ ఈ విషయములో Fight చేస్తూవచ్చారు. మేము Finance Ministers conference కు పోయినప్పుడంతాకూడ ఈ విషయమే ప్రధానంగా వస్తున్నది. మాసంగతి ఏమిటి, మా tea మీద మీరు ఇంతసంపాదిస్తున్నారు, Export duty ద్వారా తరువాత మా jute మీద మీరు ఇంతసంపాదిస్తున్నారు మా petrol మీద ఇంత సంపాదిస్తున్నారు మావద్దనుంచి income tax ద్వారా ఇంతసంపాదిస్తున్నారు కాని మాకిచ్చేది యింతేనాఅని ప్రతిరాష్ట్రము అంటూవున్నది. ఇంతకు ముందు మనకు ఏలాంటి కారణములేకుండా వుండినది. ఇప్పుడు మనకు పొగాకు ఒకటి దొరికింది. 1942-43 నుంచి ఈపొగాకుమీద Central Excise duty వేస్తున్నారు. ఇంతసంపాదిస్తున్నారు. అయితే మాకిచ్చేది యింతేనా అని అంటున్నారు. Matches Vegetable products and tobacco యీమూడు articles మీద పోయినసంవత్సరం 95 లక్షలు, ఈ సంవత్సరం 105 లక్షలు వస్తుందని మనవాళ్లు దామాషా వేసుకొన్నారు. ఈమూడు articles కు excise duty అన్ని Provinces కు కలిసి 40% వస్తున్నది. దాంట్లో మద్రాసుకు ఏదోకొంత తక్కువవస్తుంది.

Sri B. Gopala Reddi] [4th October 1955

మద్రాసుకు వచ్చినటువంటిదాంట్లో 36% ఆంధ్రరాష్ట్రానికి వస్తుంది. దానిప్రకారం 105 లక్షలు ఈ సంవత్సరం మనకువస్తుందని అంచనా వేసుకొంటున్నాము. కాని యింతేనా అంటున్నారు. నేను యిదివరకు చెప్పినట్లుగా ఇది చాలా పెద్దవిషయము. ఈసమస్య అన్నిరాష్ట్రాలలోను ఉన్నది. మనరాష్ట్రములో పొగాకువెట్లనో, అట్లనే ఇతరరాష్ట్రములలో ఇతరవస్తువు లున్నాయి. ఒకరికి tea, మరొకరికి petrol ఇంకొకరికి jute, ఈ విధంగా ఉంటున్నాయి. U. P. లోను బీహారులోను పంచదార ఉత్పత్తిఅవుతున్నది. దానిమీద Excise Duty వసూలు చేస్తున్నారు. కాని ఇంతవరకు U. P. Government కు ఏమి ఇవ్వడంలేదు. అందువల్ల మనకొక్కరికే గాదు ఈసమస్య ఉంటున్నది. ఇతర రాష్ట్రాలకుకూడ వున్నది. అంతేకాదు, ఈ విషయంలో ఏదైనా చెప్పవలసివుంటే రేపుప్రొద్దున Finance Commission వచ్చినప్పుడే చెప్పవలసి యుంటుందేగాని, ఇప్పుడు మధ్యలో ఈప్రభుత్వం ఏమిచేయలేదు. అయిదు సంవత్సరముల కొకసారి Finance Commission వేయవలెనని Constitution చెప్పుతున్నది. మొన్ననే నేను దేశముఖ్ గారితో మాట్లాడినప్పుడు, త్వరలోనే ఈ States Re-organization అంతా కూడ అయినప్పుడు, మళ్ళీ ఒక Finance Commission వేయవలసిఉంటుంది. అప్పుడు దీని విషయం మాట్లాడ వచ్చును. ఇంతకుముందు నియోగిగారి అధ్యక్షతక్రింద వాళ్లు ఒక నివేదిక ప్రచురణ చేయడం, దానిప్రకారంగా 1952-53 నుంచి కొబ్బోలు ఈ Central Excise లో మనకు కొంత వస్తున్నది. నేను మద్రాసులో ఆర్థికమంత్రిగా ఉన్నప్పుడు Central Excise అంతా కూడ Central Government తీసుకొంటూ ఉండేది. ఒక చిల్లి గవ్వకూడ రాష్ట్రప్రభుత్వాలకు ఇవ్వకుండా ఉండేది. అప్పుడు మేము అడుగుతూ వచ్చాము కాని ఏదో మేము Finance Commission వేశాము, అది వచ్చినప్పుడు చూస్తాము, ఇప్పుడు మధ్యలో ఇవ్వడానికి వీలులేదు అని సమాధానం చెప్పుతూ వచ్చారు. అటువంటిది ఇప్పుడు ఈమూడు వస్తువులమీద వచ్చేటటువంటి ఆదాయములో మేమురాష్ట్రాలకు 40% ఇస్తున్నామని ఒక beginning చేశారు. Central Excise లో కూడ రాష్ట్రప్రభుత్వాలకు ఒక share ఇవ్వడానికి వీలున్నది. ఇవ్వాలిఅనే న్యాయాన్ని అంగీకరించి, ఇస్తామని వాళ్లు ముందుకువచ్చారు. తరువాత Next Finance Commission వచ్చినప్పుడు, మనం ఇంకా ఎక్కువ అడిగి చేసుకోవచ్చు. 50% చేసుకోవచ్చు. ఆ విధంగా చేసుకొనవలసిందేగాని ఇప్పుడు Finance Commission లేదు కాబట్టి, మధ్యలో ఇప్పుడు ఏమిచేయడానికి వీలులేదు. త్వరలో వస్తుంది. ఈ లోపల, ఈ ప్రభుత్వము ఏమిచేసింది. దీనినుండి 16 కోట్లరూపాయలు కేంద్రప్రభుత్వం సంపాదిస్తుంటే మనకిచ్చేది 105 లక్షలు [illegible], అని మమ్మల్ని అడిగితే, మేము ఏమిచేయవలెనో ఆలోచించండి.

Finance Commission వచ్చినపుడు అందరుకలసి చేయవలసియుంటుంది. ఇవన్నీ తలచుకొన్నప్పుడు సుందరయ్యగారు కేంద్ర శాసనసభలోనే ఉండియుంటే బాగుండేదేమో! రాష్ట్రప్రభుత్వముయొక్క Arguments అంతా అక్కడచేసి, అక్కడ Finance Minister ను, Cabinet ను అందరిని ఒప్పించి, ఆవిధంగా మనకు వచ్చేదానికి వీలుండేదేమో అనిపిస్తుంది. అక్కడ Parliament వదిలివేసి ఇక్కడికి ఎందుకువచ్చారా అనిపిస్తుంది ఒక్కొక్కసారి. ఏమైనప్పటికీ వారు కేంద్రప్రభుత్వమునుంచి మనకు చాలా రావలసియున్నది. అది మనం తెప్పించుకోవాలి, కేవలం బీదప్రజలను పట్టుకొనివాళ్లు వాడేటటువంటి ముక్కుపొడుమును మొదలగువాటిమీద పన్నులు వేయడం బాగలేదనేటటువంటి మాట పదేపదే చెప్పుతున్నారు. ఏమైనా, వచ్చే Finance Commission ఈ విషయాలన్నీ ఆలోచిస్తారని ప్రత్యేకంగా మన ఆర్థికదురవస్థవారు గమనిస్తారని, మన పంచవర్ష ప్రణాళికకు కావలసిన డబ్బు కొంతవరకు కేంద్రప్రభుత్వమునుంచి తెప్పించడానికి ఆ Finance Commission సహాయపడతారని ఆశిస్తున్నాను.

కాని యీవిషయములో I. L. T. D. కంపెనీవారు అందరూ escape అయి పోతూన్నారు, వారు ఏమీ tax కట్టడమేలేదు అనే అభిప్రాయము చెబుతున్నారు. ఇటీవలనే వాళ్ల Managing Director గారో, మరెవరో ఒకరు యిక్కడికివచ్చి నన్ను చూచారు. వారు చెప్పినది యేమిటంటే, ప్రభుత్వానికి పన్నుల క్రిందగాని, మరేవిధంగాగాని, సంవత్సరానికి రెండు మూడు కోట్లరూపాయలవరకు Income-tax కట్టుతున్నామని చెప్పారు. ఒకవేళ యిక్కడ మన ప్రభుత్వమువద్ద తప్పించుకున్నప్పటికిన్నీ, వారికి లాభము యెక్కువవచ్చినప్పుడు, యీ High rate of graded Income-tax వారిమీద పడుతున్నది. దానిప్రకారము సంవత్సరానికి సాధారణముగా రెండు మూడు కోట్లవరకు Incometax కేంద్రప్రభుత్వానికి కటుతున్నామని చెప్పారు. దానివల్లనే కేంద్రప్రభుత్వానికి యీ Income-tax ద్వారా ఆంత ఆదాయము వస్తున్నది. అందులో మన రాష్ట్రప్రభుత్వానికి 55% ప్రకారము కేంద్రప్రభుత్వమువారు యిస్తున్నారు. కాబట్టి యీ I. L. T. D. కంపెనీవారు Tax లేకుండా తప్పించుకుంటున్నారన్న సంగతి యేమీలేదు. ఒకవేళ యిక్కడ తప్పించుకుంటే, తప్పించుకోవచ్చునుగాని, అక్కడమాత్రము యీ Income-tax నుంచి తప్పించుకోవడములేదు. ఒక్కొక్కరూపాయికి ఏ 0-8-0లో 0-9-0లో 0-10-0లో కార్పొరేషను Tax గానో, లేకపోతే high rate of graded Income-tax గానో, కట్టుతున్నారు. అంతేగాని వారు తప్పించుకొని పోతున్నారు అని చెప్పడములో ప్రయోజనములేదు.

SRI P. SUNDARAYYA :—వారికి లాభాలు ఎంత వస్తున్నవి ?

THE HON. SRI B. GOPALA REDDI :—వారికి లాభాలు ఎంత వస్తున్నాయో చూడాలంటే, published accounts ను మనము చూడవచ్చు. అందులో చూస్తే, వారు Income tax ఎంత కట్టుతున్నారో కనబడుతుంది. దాన్నిబట్టి మనమే లెక్కవేసుకొని చూడవచ్చును. వాళ్ళే చెప్పనక్కరలేదు. ఉదాహరణకు మూడు కోట్ల రూపాయలు నేను Income tax కట్టుతున్నానంటే, అది ఎంత రేటు అవుతుందో మనమే తెలుసుకోవచ్చును. వారికి ఏ నాలుగు కోట్లో నాలుగున్నర కోట్లో లాభముస్తే, ఆ హైరేటునుబట్టి, బహుశః వాళ్లు 82% నో ఎంతో కట్టుతున్నారని మనమే లెక్కవేసుకోవచ్చు. అందువల్ల ఒకవేళ వారు యిక్కడ తప్పించుకుంటున్నారని అంటే, అక్కడ కేంద్ర ప్రభుత్వము వారివద్ద తప్పించుకోవడము లేదన్నమాట. కాబట్టి యీ విషయాన్ని గురించి నేను మొదటనే చెప్పాను. (Interruption).

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మన దేశమునుంచి పొగాకు ముడిసరకు యితర దేశాలకు తీసుకొని వెళ్లి, అక్కడ తయారు చేసుకొని తెస్తున్నారు. అందువల్ల యిక్కడ వారు tax నుంచి exempt అయిపోతున్నారు. వారికివచ్చే లాభము అంతాకూడా యితర దేశాలలో తయారు చేసుకున్నప్పుడు తీసుకొని, tax ను భర్తిచేసుకోటానికి మనమీద వేస్తున్నారు. మన దేశమునుండి ముడి సరకు తీసుకొనిపోయి, తయారు అయిన సరకును మనకు యిచ్చేటప్పుడు, వారు ఆ tax నుంచి తప్పించుకొని యిచ్చే ఆ tax ను మనమీద వేస్తున్నారు. అప్పుడు వారికి ఏవిధంగాను చిక్కులేకుండా పోతున్నది. అందుచేతనే ఎంత నేపటికీని యీ tax వేసేది మన దేశములోనే ఈ పద్ధతివల్ల బ్రిటిషు కంపెనీలు అన్ని exempt అవుతున్నవి.

THE HON. SRI B. GOPALA REDDI :—అది అంతాకూడా కేంద్ర ప్రభుత్వమువారు ఆలోచించవలసిన విషయము. ఈనాడు ఎక్కువగా export duty వున్నదో లేదో నాకు తెలియదు. ఒకవేళ export duty లేకపోయినట్లయితే అది International Market లో compete చేయటానికిగాని, export అంతా stimulate చేయటానికిగాని చేశారేమోగాని Export Duty వేయటానికి లాయకీ అయినటువంటి వస్తువు, అది. ఆ విషయము క్రింద ప్రభుత్వమువారు ఆలోచిస్తారు. ఏమైనప్పటికినీ యీ మాదిరిగా కేవలము మా దేశములో పొగాకు ఎక్కువ పండుతుంది. దానిద్వారా ఎక్కువ tax వసూలు చేసుకుంటున్నారు. కాబట్టి మీరు మాకు Excise dutyలో ఎక్కువ భాగము యివ్వాలి. అని ప్రతి

గారు కేంద్ర ప్రభుత్వాన్ని కోరినట్లయితే అప్పుడు కొంత చిక్కు ఏర్పడుతుందని నుకుంటాను. ఇప్పుడు మరొక విషయము వుంది. బొంబాయి, కలకత్తా నగరాలవారు హా నగరాలలో నుంచి వచ్చిన Income-tax లో మాకు ఎక్కువ భాగము గావాలి అని అనవచ్చు, కేంద్ర ప్రభుతంము వారికి వచ్చే Income-tax లో బహుశ 0% బొంబాయి నగరమునుంచి వసూలు అవుతున్నదనుకుంటాను. ఇంకను అంతకన్న పెద్ద భాగము కలకత్తా నగరమునుంచి వస్తున్నట్లుగా వున్నది. కాబట్టి మా గరాలనుంచి ఎక్కువ భాగము వసూలుచేస్తున్నారు కాబట్టి, మాకు యిచ్చేది యింతేనా, అని అనుకోటానికి వారుకూడా ప్రయత్నము చేయవచ్చు. Income-ax క్రింద యీనాడు మూడుకోట్ల చిల్లరవరకు మనము అంచనా వేసుకున్నాము. నకు యింకా అది తక్కువ పడుతుందేమోనని అనుకుంటున్నాను. ఈ సందర్భములో క చిన్న రహస్యము చెప్పవలసి వున్నది. అది బహుశ చాలామందికి తెలుసునో లేదో నుకుంటాను. మన ఆంధ్ర దేశములో యీనాడు వసూలు అయ్యే Income-tax న్నా మన Incometax గ్రాంటు క్రిందయిచ్చేది ఎక్కువగానే వున్నది. మనకు ncome-tax దామాషా క్రింద 3 కోట్ల 7 లక్షలు వస్తున్నది. కాని మన ఆంధ్ర శములోనుంచి కేంద్రప్రభుత్వమువారికి అంత చేరడములేదు. మొన్ననే Commis-ioner of Income-tax హైదరాబాదునుంచి యిక్కడికి వచ్చారు. ఆంధ్ర దేశము నుంచి ఎంత వసూలు అవుతున్నదిన్నీ, హైదరాబాదునుంచి ఎంతవసూలు అవుతున్న దిన్నీ, వారు ఆ లెక్కలు యిచ్చారుగాని, జిల్లాల వారీగాకూడా పంపించమని వారిని కోరాను. వారు చెప్పిన దాన్నిబట్టి ఆంధ్ర దేశములో, Income-tax మూలంగా ఎంత వసూలు అవుతున్నదో తెలుసుకోవచ్చు. నిజానికి మనకు యిచ్చే దామాషా మనకు రావలసినదాని కన్న వుపరిగానే వుంటున్నది. కాబట్టి కొన్ని కొన్ని విషయాలలో మనకు కొంచెము ఎక్కువగాను రావచ్చును, తక్కువగాను రావచ్చును. కాబట్టి యింతటిలోనే, కేంద్ర ప్రభుత్వము వారిమీద ఆగ్రహపడి, వారిని వత్తిడిచేసి, వారితో ద్వంద యుద్ధము చేయవలసిన అవసరము లేదనుకుంటాను. కాబట్టి రేపు Finance Commission యిక్కడికి వచ్చినప్పుడు, ఈ విషయాలన్నీ మనము చెప్పుకోటానికి, వారు పరిశీలించటానికి వీలవుతుందని నేను శిస్తున్నాను. కాబట్టి నాగేశ్వరరావుగారు చెప్పినదానికి నేను వారికి ఒక హామీ యిస్తున్నాను. ఇది అంతాకూడా సమీక్ష చేసుకుందాము అని నేను చెప్పాను. ఈ 7½ దమ్మిడీలు పన్ను వేసేటప్పుడు యిది ఏరకంగా పనిచేయబోతుందో, అది వ్యవసాయదార్లమీద పడుతుందో, లేకో ఎకరాలలో తగ్గుతుందో, చిట్టచివరకు యిదంతా consumers మీద పడుతుందో, యీ విషయాలన్నికూడా సమీక్ష చేసుకోటానికి వీలుఅవుతుంది, ఒక సంవత్సరము అయిన తరువాత, యీ

విషయాలన్నీ సమీక్ష చేసుకోటానికి నాకు అభ్యంతరము లేదని హామీయిస్తున్నాను. తక్కిన విషయాలు ఏమైనావుంటే, వాటికి శ్రీ సంజీవయ్యగారు సమాధానము చెబుతారు.

MR. SPEAKER : The question is :

"That the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill, 1955, as amended by the Select Committee, be taken into consideration."

The motion was carried and the Bill was taken into consideration.

*Clause* 2.

MR. SPEAKER : Now, the motion before the House is :

"That clause 2 do stand part of the Bill."

SRI P. SUNDARAYYA : Mr. Speaker, Sir, I move :

"In clause 2 sub-clause (ii) for the words 'at less than two annas per cigar or cheroot', substitute 'at more than 3 pies but at less than two annas per cigar or cheroot'."

SRI P. SUNDARAYYA : Mr. Speaker, Sir, I move :

"In clause 2 sub-clause (ii) omit the words 'and beedies snuff, chewing tobacco or any other product manufactured from tobacco'."

The amendments were duly seconded.

MR. SPEAKER : According to British parliamentary practice, amendments are not moved to *omit* certain words. There, the practice is that amendments are moved 'that............words do stand part of the clause in order to obviate other amendments.

SRI P. SUNDARAYYA : The practice in Indian Parliament is to give amendments to *omit* certain words only. That is much better than the British parliamentary practice.

MR. SPEAKER : The British parliamentary practice is much better because it obviates at other amendments.

SRI P. SUNDARAYYA : That is why I do not want to move the amendment in that form. Order every member can move an amendment.

MR. SPEAKER . The amendments are before the House for discussion.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ రెండు సవరణలు నేను ఎందుకు ప్రతిపాదించాను అంటే. యిందాకనే నేను కారణము చెప్పినప్పటికిన్నీ "At less than 2 as per cigar or cheroot" అనేదానికి బదులు "At more than three pies, but at less than two annas per cigar or cheroot" అని చదువవలెనని అంటున్నాను. చుట్టలు అన్నింటి మీదను tax వేయకుండా వుండటానికి ప్రభుత్వము అంగీకరిస్తుందో లేదో అనే వుద్దేశ్యముతో కొంతవరకైనా ప్రభుత్వమునకు సమ్మతముగా వుంటుందని ఉద్దేశించి చుట్ట ఒకటింటికి 0-0-3 అంతకు తక్కువ ఖరీదు గలవాటిమీదనైనా పన్ను వేయకుండా మానవలెనని కోరుతున్నాను. అంత ఖరీదుకు మించి వాటిమీద వేయండి అని చెప్పేదాని కోసమే చెప్పాను. అందుచేత "At more than three pies but at less than two annas" అంటే రెండు అణాలపైన వాటికి యిప్పటికే పన్ను వున్నది. రెండు అణాలలోపల వున్నవాటికి పన్ను లేదు. కనుక నేను చెప్పేది యేమిటంటే, కనీసము 0-0-3 ఖరీదుచేసేవి, వీటికిమించిన వాటిమీదనే పన్ను వేయండి. ఈ లోపల వున్నవాటి పన్ను తీసి వేయండి అని అంటున్నాను. కనీసము పూర్తిగా లేకపోయినప్పటికినీ ఆ మాదిరిగానైనా ఒప్పుకుంటారేమోనని అంటున్నాను. తరువాత బీడీలు, ముక్కుపొడి వీటిమీద పన్ను వేయడము న్యాయముకాదు. కారణ మేమిటంటే. యివి పేదవారు వుపయోగించేవి. కాబట్టి వీటిమీద వద్దని హృదయ పూర్వకముగా చెబుతున్నాను. నేను కోరిన ప్రకారము అమలు జరుగుతుందో లేదో కాని, అంతకన్నా చేయగలిగినది యేమీలేదు. ఈ పరిస్థితులలో ప్రభుత్వము వీటిమీద పన్ను వేయకుండా వుండడమే న్యాయము. ఇప్పటికైనా మునిగిపోయింది యేమీలేదు. రెండు లక్షల కన్నా దానిమీద ఆదాయము రాదని ప్రభుత్వమే ఒప్పుకుంటున్నారు. గనుక యీ కొద్ది ఆదాయము కోసము పేద ప్రజలను బాధించడము సబబుకాదు.

THE HON. SRI D. SANJIVAYYA:—అధ్యక్షా, ఇదే బిల్లులో మూడు పైసలకు తక్కువ వెలగల వాటిమీద పన్ను వేసే దానికి సంబంధించినవి వేరు వేరు clauses వున్నవి. దానివల్ల వచ్చే ఆదాయము నాలుగు లక్షలు వుంటుంది. తరువాత

బీడీలమీద, ముక్కుపొడిమీద chewing tobacco మీద, or any other product మీద పదిలక్షలవరకూ వస్తుంది. తరువాత నాటు పుగాకుమీద పన్ను వేయకుండా చేసిన కారణముచేత సగానికి సగము యాభై లక్షలదాకా ఆదాయము తగ్గిపోతుంది. అందువల్ల సుందరయ్యగారు చెప్పినది ఒప్పుకోడానికి వీలుఉంది. ఇకమీదట యీ బిల్లు మార్పుచేయటానికికూడా వీలులేదు. కాబట్టి సుందరయ్యగారు ప్రతిపాదించిన సవరణను మేము ఒప్పుకోటానికి వీలులేదని మనవిచేస్తున్నాను.

MR. SPEAKER : The question is :—

"In clause 2 sub-clause (ii) for the words 'at less than two annas per cigar or cheroot', substitute 'at more than 3 pies but at less than two annas per cigar or cheroot'."

The motion was lost.

MR. SPEAKER : The question is :

"In clause 2 sub-clause (ii) omit the words 'and beedies, snuff, chewing tobacco or any other product manufactured from tobacco'."

The motion was lost.

THE HON SRI D. SANJIVAYYA : MR. SPEAKER : Sir, I move :

"In item (viii) relating to tax on raw tobacco for the words 'at the rate of six pies for every rupee on his turn over', substitute the words 'at the rate of seven and a half pies for every rupee on his turnover'."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Mr. Speaker, Sir, I move :

"For the words 'six pies' substitute the words 'three pies'."

The amendment was duly seconded.

SRI P. SUNDARAYYA :—Mr. Speaker, Sir, before I move my amendment, with your permission I want to change the wording. I want the word 'grower' to be put in place of

peasant who cultivates tobacco'. In the same way, I want the substitution of 'dealer' for 'exporter'. In Hyderabad the Courts have held that purchases for purposes of export also come under the Sales Tax Act.

MR. SPEAKER : Suppose the producers simply pass it on to other countries for export ?

SRI P. SUNDARAYYA :—The latest Supreme Court decision may change everything. The Taxation Enquiry Commission have also said 'purchases in the State by the exporter for the purpose of export and sales in the State by the importer after the goods have crossed the customs frontier are held to be not within the exemption'.

MR. SPEAKER : The hon. Member Sri Sundarayya can move his amendment.

SRI S. RANGANATHA MUDALIAR : On a point of Order, Sir. Can there be an amendment to an amendment ?

MR. SPEAKER : The amendment has not been moved. But amendments can be moved at any stage with the permission of the House. No amendment has been moved as yet. Now we are making verbal alterations to fit in with the provisions of the Act. There is a term 'grower' in the definitions and not 'peasant cultivator'. Therefore, to be consistent with the provisions of the Act and the language used therein, only verbal alterations are being made. Now, Mr. Sundarayya can move his amendment.

SRI P. SUNDARAYYA : Mr. Speaker, Sir, I move :

"In clause 2 sub-clause (ii) after the existing explanation and another explanation as follows :

*Explanation ii.* 'First purchase' in this item shall mean, the purchase from the grower by the manufacturer or dealer, either directly or through an agent or commission agent.

*Explanation iii.* The tax shall be paid by the said purchaser and shall not be collected from or passed on to the grower '."

The amendments were duly seconded.

MR. SPEAKER: All the amendments are now before the House for discussion.

SRI P. SUNDARAYYA:—అధ్యక్షా, ఈ రెండు explanations కూడా పెట్టడం అవసరము అనుకొంటున్నాను. దీనిని అమలు జరుపడానికి ప్రభుత్వానికి కొన్ని చిక్కులు వస్తాయి. దీనికి కొన్ని Rules చేసేందుకు ప్రయత్నముచేయాలి. అదికూడా చాలదన్నట్లయితే వారు వేరే చట్టములు అయినా తీసుకురావలసి ఉంటుంది. ఎందుకుఅంటే, ఇప్పుడు రైతుకు వర్జీనియా పొగాకుపైన 7½ పైసలు పన్నువిధించినప్పుడు వారుకూడా ఇది రైతుమీద పడకూడదన్నారు. రైతుమీద పడకుండా వుండాలంటే ఇది I.L.T.D. కంపెనీలాంటి పెద్ద పెద్ద manufacturers అయినా తీసుకోవాలి. పెద్ద పెద్ద టొబాకు వ్యాపారస్థులనైనా వేసుకోవాలి. ఈ టొబాకు వ్యాపారస్థులదగ్గర ఏదైనా మీదపడకుండా వుండేటట్లు చూడాలని చెబుతున్నాను. దానికి మార్గము ఏమిటని అడుగవచ్చును. ఇప్పుడువున్న రూల్సు ప్రకారము చేయగలిగితే చేయమనండి. లేకపోతే Prior గ్యారంటీగా రైతులకు కనీసం ఈ గ్రేడ్సుఅయినా ఇవ్వాలనిచెప్పి, ఆ గ్రేడ్సుకూడా ఇదివరకు మాదిరిగా I. L. T. D. కంపెనీవారు ఇష్టప్రకారం చేయకుండా మార్కెటింగ్ యార్డులు పెట్టి తప్పకుండా అక్కడ కొనవలెనని I.L.T.D. కంపెనీవారు 3 యేండ్లు గానో 5 యేండ్లుగానో కొనవలయును. కొనకపోతే Criminal action తీసుకుంటామనిచెప్పి, ఇలాంటి చట్టము తీసుకరావలసివుంటుంది. ఇటువంటిచట్టము తీసుకురానంతకాలము పన్ను తప్పకుండా రైతుమీద పడుతుంది. దాని గ్యారంటీకోసం ఇది పెట్టాము. మంత్రిగారు దీనిని సహృదయంతో, సదుద్దేశ్యంతో, సద్భావంతో నిజంగా ఇటువంటి చట్టము తెస్తామని హామీ ఇచ్చినట్లయితే వాటిని అంగీకరించడానికి చాలా వీలుగావుంటుంది. అది లేకపోతే ఇటువంటిహామీ ఇవ్వము, పన్నువేస్తాము అంటున్నారు. అందుచేత వాటికి explanations అయినా మీరు అంగీకరించాలని నేను కోరుతున్నాను. దాంట్లో తగ్గవిషయం ఏమీలేదు. ప్రభుత్వ ఆదాయము ఒకదమ్మిడీకూడా తగ్గడంలేదు. అందుచేత దీనిని అయినా మీరు అంగీకరించాలని నేను కోరుతున్నాను.

THE HON. Sri D. SANJIVAYYA:—రైతులకుగాని, consumers కు గాని, వ్యాపారస్థులకుగాని ఏమైనా కష్టమువచ్చినట్లయితే ఒక సంవత్సరము తరువాత దీనిని పునరాలోచిస్తాము అని ముఖ్యమంత్రిగారు ఇంతకుముందె చెప్పారు కనుక మనం ఒక సంవత్సరము చూద్దాము. చూచినతరువాత కష్టాలువున్నట్లయితే వాటిని తొలగించడానికి ప్రయత్నంచేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, ఇది వరకువచ్చిన దాంట్లో Taxation proposals వేస్తే వాటిని తగ్గించడానికి amendments కు అవకాశంవున్నదిగాని, హెచ్చించడానికి అవకాశంవున్నదా? ఈ బిల్లు సెలక్టుకమిటీకి వెళ్లినప్పుడు 6 పైసలువున్నదాన్ని 7½ పైసలు వేయాలని వారు నిర్ణయించారు. దానికి గవర్నరు పర్మిషను పుచ్చుకున్నాముఅని చెప్పారు అనుకోండి. అసలు ఒక సాంప్రదాయమువున్నట్లయితే Taxation మొట్టమొదట గవర్నమెంటు ప్రపోజా ఏది అడిగినారో ఆ ప్రపోజల్సు రావాలనిగాని వాటిని మొదటే enhance చేసే గవర్నరుదగ్గరకు పోవడముఅనేది సరియైనపద్ధతి కాదేమో. ఈపద్ధతిని మీరు ప్రతిపర్యాయము అంగీకరించినట్లయితే ప్రజానీకానికి మొట్టమొదట బిల్లుఇచ్చినప్పుడు ఏ వుద్దేశ్యంవున్నదోకూడా తెలియనటువంటి పరిస్థితి ఏర్పడుతుంది. దానిని తరువాత మళ్లీ ఎప్పుడుఅయినా హెచ్చించవచ్చును అని ఆక్లాజులో వుండడానికి కారణముకూడా వారే Constitution లో మీకు పన్ను వేయుటకు ఎక్కువ చేయడానికి వీల్లేదు. ఆ పన్నును తగ్గించుకుంటే తగ్గించుకోవచ్చును. శాసనసభలో చర్చచేసి సభ్యుల ఆమోదంకూడా పొందవలసివుంటుంది. దానిని మీరు ప్రధాన సూత్రంగా అంగీకరించాలనేది ఆరోజు తమరుఇచ్చిన రూలింగులోగాని, రూల్సులో గాని అగుపడుతున్నది. దానిని మరల హెచ్చించడము సరియైనపద్ధతి కాదు.

THE HON. SRI D. SANJIVAYYA:—గవర్నరు అనుమతితోనే హెచ్చించామండి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అది కాదు నేను చెప్పేది. అసలు గవర్నరుదగ్గరకు మరల ఎందువల్ల పోవలసివచ్చింది. దానిమీద మరల ఇంకొకబిల్లు తీసుకురండి. సగం తగ్గించామంటున్నారు. తగ్గించడమే మనపని, ఎక్కించడానికి వీలులేదు, ఎక్కించడానికి మరల గవర్నరు మొత్తము Structure అంతా మార్చడము ఆర్థికశాఖకువెళ్లడం ఇది అంతా కావాలి. Constitutional provision అంతా ఉపయోగపరచడము ఇదిఅంతా కావాలి.

ప్రతిపర్యాయముకూడా ఇదేవిధముగా రోజురోజు taxationలు తీసుకువచ్చినట్లయితే సెలక్టుకమిటీకి వెళ్ళినతరువాత enhance చేయడము వచ్చేటప్పటికి అసలుఅది సెలక్టు కమిటీకి వున్నటువంటిది పద్ధతి కాదు. మనకు orbit ఏద్తైతే ఉన్నదో దాంట్లో తగ్గించడానికి శాసనసభకు అవకాశము ఉన్నదిగాని, హెచ్చించటానికి వీల్లేదు అనేది ఒకపాయింటు. ధరల్లోనూ వడ్డీలోనూ వస్తున్న తేడానుగురించి ఇందాక నేను మనవిచేస్తున్నాను. అందులో సుందరయ్యగారు చెప్పిన ప్రపోజల్సు అన్నీ ఒప్పు కున్నట్లయితే పోనీలెమ్మని అనుకోవచ్చు. ఇదిఏమైనా రైతుమీద పడేద నేహామీ మాత్రము మీరు కావలసినదంతా ఏర్పాటు చేస్తాము అంటే, పోనీ డబ్బువచ్చేవాళ్ల మీద ఆదాయం వచ్చేవాళ్లమీద వసూలు చేస్తాముఅంటే అంతమాత్రంలో వీరు మీరుయిచ్చే హామీ కాగితముమీద పెట్టమన్నారు. అంతకన్నా ఏమీలేదు.

THE HON. SRI D. SANJIVAYYA :—మా నోటిమాటమీద నమ్మకం లేదా ?

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—మీ నోటిమాట మీద నమ్మకంలేదని నేను చెప్పటలేను. అది కాగితముమీద పెట్టకపోక మీఆఫీ సర్లదగ్గరకుపోయి కాగితముమీద వున్నదయ్యాఅంటే, ఒప్పుకుంటారుగాని అసెంబ్లీలో జరిగిన ఉపన్యాసము తీసుకుపోతే నాకు జ్ఞాపకములేదంటారు.

THE HON. SRI D. SANJIVAYYA :—అసెంబ్లీలలో ఇచ్చిన assurances కు కూడా విలువ ఉన్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అసెంబ్లీలో చెప్పినదానికి విలువ ఉన్నదని High Courts ఎప్పుడూ ఒప్పుకోలేదు. Act లో పెడితే ఒప్పుకుంటాము కాని మంత్రిగారు ఒప్పుకున్నారు కాబట్టి ఆచరణ లోనికి వస్తుంది అని అంటే అది సరియైన legal aspect కాదు. మంత్రులు చెప్పిన మాట లకు ఆమాటల విలువే తప్ప అది law కాదని మనవిచేస్తున్నాను. కోర్టులకు వెళ్లితే ఎవరి interpretation వారిది. వ్యాఖ్య చేయవలసింది కోర్టువారు. ఎవరు ఏది చెప్పినా చెల్లదు. కోర్టులకు తీసుకుపోతే అక్షరాలలో పొరపాటున్నా కామాలలో పొరపాటున్నా అంతే అవుతుంది. నేను కామా పెట్టలేదని వెనుక ఒక D.S.P. చెప్పాడు. నిజమే అనుకున్నాను. జైలు శిక్షపడేదనుకున్నాను. మొదటి ఆర్డరులో కామాలేదు ; రెండవ ఆర్డరులో కామా ఉన్నది. 6 నెలలు శిక్షపడింది. కామా వల్ల కాగితంలో ఏమి ఉన్నదని కాని, హృదయంలో ఏమి ఉన్నది, మాటలలో

ఏమి ఉన్నది అనేది కాదు. వీరు ఒప్పుకుంటున్నారు. ఒప్పుకోకపోతే సమస్య లేదు. నోటితో అంగీకరించేదానిని కాగితంమీద అంగీకరిస్తే ధైర్యంగా ఉంటుంది. అదికాదు అంటే కనీసం డబ్బు తగ్గించాలని సవరణ పెడుతున్నాను.

SRI N. VENKAIAH :—అధ్యక్షా, ఈ పొగాకు పరిశ్రమ ఆంధ్ర దేశములో చాలా చక్కగా పెరుగుతున్నది. ఇది కొన్ని తాలూకాలలో రైతులకు పరిమితం కావచ్చును. కాని కొన్ని లక్షలు కూలీలకు curing వల్ల grading వల్ల పని దొరుకుతుంది. ఎక్కువ కూలి వస్తున్నది. ఇలాంటి పరిశ్రమకు తగిన దోహదం ఇవ్వాలని ప్రభుత్వం ఆలోచించలేదు. దీనికి ఎంత ఖర్చు పెట్టబడుకొందో, ఎంత ఆదాయం రైతులకు వస్తుందో, కనీసం 5,10 సంవత్సరాల average ఆదాయంమీద ఎంత వస్తుందో ఇంతవరకు గమనించలేదు. పెట్టుబడి విషయంలో ఎలాంటి సహాయం చేయడంలేదు. అమ్మకంలో కూడా ఏవిధంగాను తోడ్పడడంలేదు. Corporation ను ఒకటి పెట్టి ఇతరదేశాలకు ఎగుమతులు చేసి ఆదాయాన్ని ఆర్జించాలని పెట్టుకోలేదు. కాని కేంద్ర ప్రభుత్వం వారుదీనినుండి 30 కోట్లు రూపాయిలు ఆర్జిస్తున్నారు. మనం కోటి రూపాయిలకు పైగా ఆర్జిస్తున్నాము. దీనిపై ఇంకా విచక్షణా రహితంగా ఎక్కువ పన్నులు విధించడం పరిశ్రమను మొదలంట నాశనం చేయడానికి కారణం అవుతుందేమో అని మనవి చేస్తున్నాను. ప్రభుత్వంవారు తప్పనిసరిగా తమ వాగ్దానాన్ని అనుసరించి వచ్చే సంవత్సరమైనా దీనిని పరిశీలించి సవరణ చేస్తారని ఈలోగా సమగ్రమైన విచారణ చేస్తారని ఆశిస్తున్నాను. గత 5 సంవత్సరాలుగా చాలా పొగాకు నిలువ ఉండి వృధా అయిపోయింది. ఈ మధ్య చైనా ఎగుమతులు కొంచెంవచ్చాయి అన్నారు. కాని ఈ ఎగుమతులలోని లాభాలు రైతులకు చెందలేదు. అంతా మధ్య వ్యాపారులకే పోయింది. 30, 40 రూపాయిలకు పుట్టి తీసుకుని ఏ రు. 250 లు ధరకు అమ్మినారు. ప్రభుత్వం వారు చైనాలో మాదిరిగా ఇక్కడ ఒక Corporation పెట్టుకొని దానిద్వారానే సంబంధ బాంధవ్యాలు కుదుర్చుకునే ఏర్పాటు చేసుకుంటే రైతులకు రెండితలు ఇవ్వ కలిగేది. ప్రభుత్వంకూడా కొన్ని లక్షలు ఆర్జించడానికి అవకాశం ఉండేది. ఇతర దేశాలకు పొగాకు ఎగుమతియై అక్కడనుంచి సిగరెట్లు దిగుమతి అవుతున్నాయి. ఇక్కడనే ఒక సిగరెట్ల ఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభిస్తే ప్రభుత్వానికి చాలా ఆదాయం లాభాలు రావడానికి అవకాశం ఉండవచ్చును. ఇవన్ని పరిశీలన చేయవలసిన విషయాలు. ఇతర దేశాలలో విపరీతమైన పోటీలు ఉన్నసమయంలో ఇతర దేశాల ధనాన్ని ఆర్జించడానికి ఇది అమూల్యమైన సాధనం. ఇంతకన్న ఎక్కువ సాధనాలు ఉన్నాయి అని అనుకోడంలేదు. మన ఎగుమతులకు తగిన స్థావకాశాలు ఇతర దేశాలలో పడిపోతున్నాయి. Newfoundland

Sri N. Venkaiah] [4th October 1955

అమెరికా దేశాల పొగాకు కన్న మనం కొంత చవకగా అందించడానికి ప్రయత్నించడం వల్లనే ఈరోజు మన పొగాకు కొనగలుగుతున్నారు. ఇతర దేశాలు కొనడం మాని వేస్తే మనకు వచ్చే ఆదాయం పడిపోతుంది. Central Government కు మన రాష్ట్రానికివచ్చే ఆదాయాన్ని గమనించి దీనికి అధికమైనపన్నులు విధించడానికి విచక్షణ లేకుండా పూనుకోడం మంచిది కాదని మనవి చేస్తున్నాను. వచ్చే సంవత్సరమైనా పునరాలోచించి ఈ పన్ను తొలగించడానికి పూనుకుంటుందని ఆశిస్తున్నాను.

Mr. SPEAKER : I will now put the amendments to the vote of the House.

The question is :

"For the words 'six pies', substitute the words 'three pies'."

The motion was lost.

Mr. SPEAKER : I will now put the official amendment to the vote of the House.

"In item (viii) relating to tax on raw tobacco for the words 'at the rate of six pies for every rupee on his turnover', substitute the words 'at the rate of seven and a half pies for every rupee on his turnover'."

The motion was carried.

Mr. SPEAKER : I am putting the amendments of Sri P. Sundarayya to the vote of the House.

The question is :

"In clause 2 sub clause (ii) after the existing explanation, add another explanation as follows :

*Explanation ii.*—'First purchase' in this item shall mean the purchase from the grower by the manufacturer or dealer, either directly or through an agent or commission agent.

*Explanation iii.*—The tax shall be paid by the said purchaser and shall not be collected from or passed on to the grower'."

The amendments were lost.

Clause 2 as amended was put and carried.

Clause 3 and 1 and the Preamble were put and carried.

4th October 1955]

THE HON. SRI D. SANJIVAYYA : Mr. Speaker, I move—

"That the Madras General Sales Tax and the Madras Tobacco) Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill, 1955 (L. A. Bill No. 15 of 1955) be passed into law."

MR. SPEAKER : Motion moved—

" That the Madras General Sales and the Madras Tobacco (Vaxation of Sales and Registration) (Andhra Amendment) Bill 1955 (L.A. Bill No. 15 of 1955) be passed into law."

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ మూడవ రీడింగులో ఒకటి. రెండు విషయాలు చెప్పదలచుకున్నాను. ముఖ్యమంత్రిగారు సమాధానం చెబుతూ రైతులకు నష్టం కలుగదు అన్నారు. నష్టం కలుగడానికి గీటురాయి పెట్టారు. ధరలైనా తగ్గాలి, ఎకరాలైనా తగ్గాలని చెప్పారు. అప్పుడు ఆలోచిస్తాము అన్నారు. అది సరిఅయిన గీటురాయి కాదు.

రైతులకు ఆదాయము తగ్గేటప్పుడు, వారు పుగాకు మానివేసి పూర్తిగా నష్టపడేదానికన్న వేరుమార్గములేదు కాబట్టి, తక్కువ ఆదాయము వచ్చినప్పటికీని, ఆ తక్కువ ఆదాయముకొరకే సాగుచేయటానికి ముందుకువస్తున్నారు. రైతులకు ఎకరాలు ఎక్కువైనా, గీటురాయి పెట్టటానికి ఎక్కువ ఆదాయము వస్తున్నదా, తక్కువ ఆదాయమువస్తున్నదా అనేదిచూడాలి ఇదివరకటికన్నా ఎక్కువ ఆదాయము వస్తూంటే, సరే, పన్ను వేయవలసిందే. ఇక తక్కువ ఆదాయము వస్తూంటే, దాన్నిబట్టే చూచుకోవలసి వుంటుందని మాత్రము ప్రభుత్వము గుర్తించాలి.

రెండవది రైతుకు ఆదాయము యిదివరకటికన్న కొంత పెరిగిందనేది సమస్య కాదు. ఇదివరకే టోకు వ్యాపారస్థులు, I.L.T.D, కంపెనీ లాంటివారు ప్రజలమీద పడి మరింత ఎక్కువలాభాలు సంపాదించుకుంటున్నారు. అట్లా అధికలాభాలు సంపాదించుకోకుండా తగ్గించటానికి ప్రభుత్వము ఏమైనా చర్యతీసుకున్నదా అనేది చూడాలి. I. L. T. D. కంపెనీవారు, పన్నులరూపములోనైతేనేమి, మరి యితర రూపములతోనైతేనేమి, ఏదో రూపములో సంవత్సరానికి రెండు మూడుకోట్ల రూపాయలు ఆదాయపుపన్నుక్రింద, ఆపన్నుక్రింద, యీ పన్నుక్రింద కేంద్రప్రభుత్వానికి యిస్తున్నారని గోపాలరెడ్డిగారు చెప్పారు. అయితే వారికి నిజంగా ఎన్నికోట్ల రూపాయలు ఆదాయము వస్తూవున్నది? వారి పెట్టుబడి మొత్తము ఎంత? వారు

ఎంతమంది డైరక్టర్లు ? ఇప్పటివరకు ఎన్నికోట్లు సంపాదించారు ? ఇకముందు ఎన్ని కోట్లు సంపాదించబోతారు అనే విషయాలు చూచుకున్నప్పుడు, వారు రెండు మూడుకోట్లు చెల్లిస్తున్నారంటే, దానికి బహుశవారి లెక్కల ప్రకారమే సుమారు ఏ నాలుగు అయిదుకోట్లో లాభము వచ్చివుండవచ్చునని అన్నప్పుడు, అందులో వారిది విదేశకంపెనీ అయినప్పుడు అటువంటి కంపెనీ మన ప్రజలమీద పన్నువేసి, వారు ఇన్నికోట్లు లాభాలు సంపాదించుకొని పోయేటట్లు చేయడము, యిది ఏరకంగా న్యాయమో ఆలోచించాలి. కాబట్టి దీన్నిగూడా అరికట్టేటట్లు చేయాలని అంటున్నాను.

ఇక నా ఉపన్యాసము ఇరవైమూడువేల రూపాయలు విలువచేస్తుందో లేదో కాని, అది నేను చెప్పలేను. కాని రోజుకు 12-8-0 రూపాయలవంతున ముప్పావు గంటసేపు మాట్లాడాను. ఆ ప్రకారము చూస్తేనైనా, నా వుపన్యాసము ఇరవైమూడు వేల రూపాయలు విలువచేయదు. కాని నేనుచెప్పిన సూచనలను ప్రభుత్వము అమలు జరిపేటట్లయితే, అప్పుడు నా వుపన్యాసానికి లక్షల విలువవుంటుంది. అట్లా అమలు జరపకుండా వున్నప్పుడు వుపన్యాసానికి విలువలేకుండపోతుంది.

కేంద్రములో నేవుంటే బాగుండేది, అక్కడ మంత్రులకు యింకా యితరులకు చెప్పి మన రాష్ట్రవ్యవహారాలు నిర్వర్తింపచేయగలిగినవారయ్యేవారు, అట్లా కాకుండా యిక్కడికి ఎందుకువచ్చారు, అక్కడవుంటేనైనా ఎక్కువ వుపయోగముగావుండే వారు అని నన్ను అన్నారు. నేను అక్కడ మూడు సంవత్సరముల కాలమువున్నాను. అక్కడకూడా యీ విషయాలుఅన్ని చెప్పాను. Finance Commission రిపోర్టు వచ్చినప్పుడు, అన్ని రాష్ట్రాలనుంచివచ్చిన Excise duty అంతాకలిపి, నూటికి 75 వంతులు రాష్ట్రాలకుయిచ్చి వేయాలని అన్నాను. కనీసము నూటికి 50 వంతులు అయినా పంచమనిచెప్పాను. కాని వారు వినలేదు. అక్కడ కేంద్రములో బ్రహ్మాండమైన కాంగ్రెసు సైన్యమువున్నది. నేను ఎంతచెప్పినా లాభము లేకపోయింది. అక్కడ వ్యక్తిగతంగా చెప్పినను ప్రయోజనము లేకుండా పోయింది. పోని, రాష్ట్రాలకుఅయినావెళ్లి, అక్కడనైనా రాష్ట్రప్రభుత్వాన్ని అయినా కదిలించి చూద్దాము- అని యిక్కడికివచ్చి రాష్ట్రప్రభుత్వాన్ని కదిలించిచూస్తే, రాష్ట్రప్రభుత్వముఅయినా దెబ్బలాడుతుందేమోనని ఆలోచిస్తే, యిక్కడి ప్రభుత్వముకూడా Finance Committee వచ్చిందాకా మేమేమిచెయ్యలేమని చెబుతున్నది. కాబట్టి యీ విధంగా చూచినాగూడా లాభములేకుండావున్నది. అక్కడా లాభము కనపడలేదు, యిక్కడ కనబడలేదు. (Laughter) కాని యిక్కడికి నేనువచ్చిన ఆశయము యేమిటంటే, యిక్కడవున్న వారందరు ఆంధ్రమంత్రులుగదా! ఆంధ్రుల అభివృద్ధికొరకు నేనుచేసిన సూచన అంగీకరించి కేంద్రప్రభుత్వము వారితో దెబ్బలాడుతారని ఆశిస్తే, యిక్కడ అంతకంటే లాభములేకుండా పోతున్నది.

కాబట్టి యీ పన్నుల విషయములో, ప్రభుత్వము కొంచెము జాగ్రత్తగా ఆలోచించిచేయాలని అంటాను. Income tax విషయములో మన ఆంధ్రరాష్ట్రము నుంచి వసూలుఅయి కేంద్రానికి పోయేదానిలో మనకు యింకొక 10 లక్షలు దాకానో యింకా ఎక్కువగానో కేంద్రమువారు యిస్తున్నారని గోపాలరెడ్డిగారు చెప్పారు. అంటే రెండు, రెండున్నరకోట్లలోపుగా వసూలుఅయ్యే Income tax కు గాను మూడుకోట్లు మనకు యిస్తున్నారు, అందువల్ల మనకు ఎక్కువేవస్తున్నదిగదా అని అన్నారు. కాని Excise ద్వారా మన రాష్ట్రమునుంచి 18 కోట్లు తీసుకొనిపోతే, అందులోనుంచి మనకుయిచ్చేది ఒకకోటేగదా అని అంటున్నాను. అంటే ఏ రాష్ట్రములో ఎంతవస్తే, అదంతా ఆ రాష్ట్రములోనే ఖర్చుచేయాలనేది నా సిద్ధాంతము కానే కాదు, Income-tax గానీయండి, Excise కానీయండి, Customs కానీయండి, యీ రకంగా అన్నిరాష్ట్రాలనుంచి వసూలుఅయిన సొమ్ములో, కేంద్రము వారి ఖర్చులుపోను మిగిలిన దానిలోనుంచి రాష్ట్రములయొక్క జనాభాప్రకారము ఖర్చుచేయమని అంటున్నాను. వెనుకబడిన రాష్ట్రములయితే, దానికి యింకా కొంచెము అదనంగాయిచ్చి ఖర్చుచేయాలని అంటాను. అంతేగాని, మాకు ఇక్కడ పుగాకుమీద యింతవస్తున్నది గనుక అదంతా యిక్కడనే ఖర్చుచేయాలని, ఆ state లో టీ నుంచి యింతవస్తున్నది. కాబట్టి అదంతా అక్కడ ఖర్చుచేయాలనిచెప్పే సిద్ధాంతము నాదికాదు. దీనికి ఎవరూకూడా వ్యతిరేకులువుండరు. అందువల్ల Finance Committee వారు వచ్చినప్పుడు పూర్వకానే ఒక memorandum యిచ్చినంత మాత్రముచేత ఏలాంటి ఉపయోగము వుండదు. గనుక యిప్పటినుంచి ఆ విషయములో పూర్తిగా కృషిసాగించాలని కోరుతున్నాను. ఈ పన్నులను వేసేటప్పుడు కొంచెము జాగ్రత్తగా ఆలోచించి వేయవలసిందిగా కోరుతూ విరమిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, పుగాకు మీద పన్నువేసే సందర్భములో యుద్ధము వచ్చినప్పుడు ప్రారంభించి, అది ఒక్క సంవత్సరములో పూర్తిఅవుతుంది కాబట్టి, తరువాత తీసివేస్తామని కేంద్రప్రభుత్వము వారు చెప్పారు. ఆ సమయములో రాష్ట్రాలలోకూడా sales tax క్రింద పన్నులు వసూలుచేస్తున్నారు. అప్పుడు కేంద్రప్రభుత్వమువారు చెప్పిందిఏమిటంటే, రెండు వైపులనుంచి పన్నువేస్తే, కష్టముగా ఉంటుంది కాబట్టి మూడుసంవత్సరములమీద average కట్టి, వసూలుచేసి, మేమే రాష్ట్రప్రభుత్వానికి యిస్తాము, మీరు వసూలు చేయవద్దని రాష్ట్రప్రభుత్వాన్ని ఆదేశించినట్లు చెప్పారు. అప్పుడు రూల్సు revise చేసి యింకా ఎక్కువగా వసూలుచేసి యివ్వడము జరిగింది. రాష్ట్ర ప్రభుత్వము మాత్రము వసూలుచేయడము ఆపివేశారు. ఆ తరువాత నియోగిగారి అధ్యక్షతన

finance committee ని వేశారు. వారువచ్చి విచారించి చెప్పినది యేమిటంటే యింతవరకు Tobacco మీద వసూలుచేసిన పన్నులో దామాషా రాష్ట్రప్రభుత్వాలకు యివ్వడములేదు. వారు వసూలుచేసిన డబ్బుమాత్రమే మేము యిస్తున్నాము. ఇకమీదట ఆ డబ్బులో మీకు భాగము యిస్తున్నాము. అదిఅంతా మొత్తము రెండున్నరకోట్లు అవుతుంది. దాన్ని మద్రాసు రాష్ట్రానికి యిస్తున్నాము. గనుక యికమీదట మీరు పుగాకుమీద పన్ను వేయవలసిన అవసరము లేకుండా పోతుందని అభిప్రాయ పడుతున్నాము. కాని యీపన్ను రాష్ట్రాలు స్వయముగా వేసుకొని వసూలు చేసుకుంటాము అంటే మాకేమి అభ్యంతరము లేదని అన్నారు. అసలు దీనిలోవున్న ప్రధానసూత్రము యేమిటంటే పుగాకుమీద ఏనాడైతే Sales Tax రూపములో పన్ను వేశారో, ఆ పన్నుకంటే ఎక్కువగానే మనప్రభుత్వానికి వస్తున్నది. అయితే సుందరయ్యగారు యింకా యితరులు చెప్పింది యేమిటంటే, పన్నులు ఎక్కువగా వచ్చేటట్లయితే, general pool లో నుండి వస్తే బాగావుంటుందని అన్నారు. మనకు అసలు ఎక్కువడబ్బు కేంద్రమునుంచి వచ్చేటట్లయితే, ఇక్కడ రాష్ట్రములో వసూలు చేయటానికి అవసరమే వుండదు. అట్లాంటిది యిక్కడ వసూలు చేయటానికి ప్రారంభించారు. అప్పుడు మనము మద్రాసు రాష్ట్రములో వున్నాము గనుక, ఎందుకు యీ పన్ను వేస్తున్నారని అడిగితే, మాకు తక్కువ డబ్బు వస్తున్నది గనుక క్రిందివారిని exempt చేస్తూ, ఎవరికిగూడ ఎక్కువ బాధకరంగా లేకుండా కొద్దిగా వేసి వసూలు చేస్తామని చెప్పారు. క్రిందివాళ్లు అంటే, ముక్కుపొడి పీల్చేవారు, తమ్మాకు వేసేవారు, చుట్టలు త్రాగేవారు పుగాకు నమిలేవారు, పొలములో వ్యవసాయమువల్ల జీవించేవారు, అటువంటివారందరిమీద కూడ వేసి వసూలుచేస్తామని అంటే, దానిమీద తీవ్రంగా చర్చ జరిగినతరువాత, వారందరిని వదిలివేసి, బిల్లు తీసుకొచ్చారు. మరల రెండు సంవత్సరాలు జరిగిన తరువాత, వాళ్ళ అంతస్థుకు వెళ్ళడము జరిగింది. ఈవిధంగా జరిగి యింకా యే అంతస్థుకు వెళ్లుతుందో తెలియని స్థితి యేర్పడుతూవస్తున్నది. ప్రస్తుతమువున్న విధానముచూస్తే యీ Virginia Tobacco మీద అటు కేంద్ర ప్రభుత్వము, యిటు రాష్ట్ర ప్రభుత్వము యిద్దరూగూడా వసూలుచేస్తున్నారు. ఈ విధానము సరియైనదికాదని అంటున్నాను. అందువల్ల యీవిధంగా double taxation లేకుండా ఒక సమగ్రమైన విధానము ఒకటి ఆలోచిస్తే బాగావుంటుంది. ఇది ఒక సంవత్సరమువరకు వుంచే ఆలోచన చేయకుండా యింకా త్వరలోనే దీని విషయము ఆలోచిస్తే బాగా వుంటుందని కోరుతున్నాను.

MR. SPEAKER : The question is :—

"That the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill 1955 (L.A. Bill No. 15 of 1955) be passed into law."

The motion was carried and the Bill was passed into law.

MR. SPEAKER. I now adjourn the House *sine die.*

The House adjourned *sine die.*

*Appendix*

Paper to be placed on the Table of the House.

*Vide* ANSWER TO STARRED QUESTION No. 20.
(S. No. 561) at page 279 supra.

*Recommendation of Sri R. S. Malayappan already implemented or under execution :*

*Agriculture :*

1. Improvement of Agricultural facilities in Seethampeta and Gummalakshmipuram of Srikakulam District.

2. Reclamation of 25? acres of land of Agricultural association of Sarabhannapalem, Gudem Taluk, Visakhapatnam District.

3. Scheme for opening of demonstration-cum-explanatory farm at Rampachodavaram.

4. Scheme for training 30 Hillmen as demonstration Maistries.

5. Scheme for training of 37 Hillmen in improved methods of Agriculture.

*Foresis :*

6. Ameliorative measures for the Welfare of Chenchusd

*Verterinary :*

7. Appointment of special District Veterinary Officer for Agency Development.

8. Appointment of two additional veterinary assistant surgeons and 6 live stock Inspectors.

9. The distribution of cattle and payment of bonus to hillmen.

10. Payment of bonus to Koyas in East Godavari District for cattle supplied.

11. Scheme for opening of 3 poultry units in Agency areas.

12. Purchase of refregerator to the special District Veterinary Officer.

*Cottage Industries* :

13. Conversion of Government Hill rearing station at Chintapalli in Visakhapatnam District.

14. Starting of a foreign Race production farm at Araku, Visakhapatnam District.

*Medical* .

15. Provincialisation of Local Fund Dispensary at Rampachodavaram.

16. Opening of Regular Government dispensary at Dummagudem.

17. Provincialisation of Local Fund Dispensary at Addatheegala and its conversion into 12 beded hospital.

18. Weekly visits to villages by Medical Officers of Polavaram and Jeelugumalli.

19. Opening of Dispensary at Pedavalasa.

*Roads* .

20. Forming Minamalur Ghat Road.

21. Forming of a Road from Rampachodavaram to addatheegala and tence to Cheruvommapalem.

22. Forming a road from Gangavaram to join M.D.R. No. 6 Rajahmundry Taluk via Nellipudi.

23. Forming an all weather Road from Jeelugumalli to Ankampalem.

24. Road from Addatheegala to Ramavaram.

25. Road from Donukonda to Gudem via Lankapakala.

26. Road from Lammasingi to Gangaraju Medugole.

27. Road from Paderu to Sujunakota.

28. Road from Paderu to Orissa border via Hukkompeta and Kinchumanda.

29. Road from Pedavalasa to Katragadda.

30. Road from Rampachodavaram to Bhadrachalam via Maredumilli and Lakkavaram.

*Medical* :

31. Provision of Itenrating dispensary at Vajedunagaram.

32. Weekly visits to Sarabhannapalem and Jaddangi by Medical Officer, Rajavemmangi.

*Cottage Industries* :

33. Training of 20 hillmen in cottage Industries.

34. Scheme for extraction of palmyrah fibre.

*Public Health* :

35. Nagur Anti Malarial Scheme.

36. Anti Malarial scheme, Paderu.

27. Extension of Anti-Malarial Scheme, Nagur.

38. Extension of Anti-Malarial Scheme, Paderu.

39. Extension of A.M. Scheme, Polavaram.

40. Extension of Anti-Malarial Scheme, Chintapalli and Krishnadevipeta.

41. Anti-Malarial Scheme, Srungavarapukota.

42. Anti-Malarial Scheme, Parvathipuram and Pathapatnam.

43. Anti Yaws compaign Scheme.

*Miscellaneous* :

44. Four land colonisation schemes in Jeelugumalli of West Godavari District Aminabad, Pochavaram and Gannavaram, East Godavari District.

45. Rural Water Supply Schemes in Agency areas.

46. Development of Fisheries in Agency areas.

*Co-operation* :

47. Amelioration of Backward Classes Co-operative stores in East Godavari District—Development of Addatheegala Co-operative stores in Yellavaram Agency.

*Women Welfare Department* :

48 Opening of Women Welfare Centres at Addatheegala and Kannapuram.

49. Amelioration work among hillmen for improving their health, hygiene, for promoting their economic, domestic and social conditions.

50. Starting of a poultry farm at Rampachodavaram.

*Appendix II.*

Vide Answer to starred question No. 328 (S. No. 511) at page 293 supra.

The maximum special fees per pupil in Local Bodies and aided Secondary Schools.

| Name of fees. | | For forms I to III. Rs. a. p. | | | For Forms IV to VI. Rs. a. p. | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. Admission fees | ... | 0 | 8 | 0 | 0 | 8 | 0 |
| 2. Library fees | ... | 1 | 8 | 0 | 2 | 0 | 0 |
| 3. Literary Association fees | ... | 1 | 8 | 0 | 2 | 0 | 0 |
| 4. Games fees | ... | 2 | 0 | 0 | 3 | 0 | 0 |
| 5. Science fees | ... | Nil. | | | 1 | 0 | 0 |
| 6. Medical inspection fees As. 12 in the case of 1st inspection and As. 6 in the case of subsequent inspection. | | | | | | | |
| 7. Visual Education fees | ... | 1 | 0 | 0 | 2 | 0 | 0 |
| 8. .Hobbies and Craft | ... | 1 | 0 | 0 | 2 | 0 | 0 |
| 9. Excursion Scouting | ... | 1 | 0 | 0 | 2 | 0 | 0 |
| 10. Examination fees (Stationery and Printing) | ... | 1 | 8 | 0 | 2 | 0 | 0 |
| 11. Games fees in girls schools | ... | 1 | 0 | 0 | 2 | 0 | 0 |

and in *Government Secondary Schools.*

The Special fees collected in Government Secondary Schools do not exceed the following limit.

| | | Rs. | a. | p. | Rs. | a. | p. |
|---|---|---|---|---|---|---|---|
| 1. Admission fees | ... | 0 | 8 | 0 | 0 | 8 | 0 |
| 2. Library fees | ... | 1 | 8 | 0 | 2 | 0 | 0 |
| 3. Literary Association (Consolidated amount for reading room, school magazine and school calendar) | ... | 1 | 8 | 0 | 2 | 0 | 0 |

